Photo by N. Ramakrishna



బహుమతి
పొందిన వ్యాఖ్య

టాకీలు

పంపినవారు:
జి. సుబ్బారావు - టంగుటూరు

వ స్తూ ం ది!

అశోకా పిక్చర్స్ వారి

# నా చెల్లెలు

జి.వరలక్ష్మి.. సూర్యకళ..
అనసూయ.. కోటిరత్నం..
బళిజేపల్లి.. అమర్‌నాథ్..
రామశర్మ.. చలం..
పండితరావు..
గణపతిభట్..

నటించినది





మాటలు.... పరశురామ్.
పాటలు ప్రయాగ.. కెమెరా.. బి.యస్. రంగా.
సంగీతం.. సి.యస్. పాండురంగన్..
స్టూడియో.. రేవతి..



KRISHNA

దర్శకుడు.. చిత్రపు నారాయణమూర్తి. బి.ఏ.

చ మ్రి యా రి లీ జు

# పాపాయులూ !

విన్నారా ఈ కథ ?

మద్రాసులో ముగ్గురు పిల్లలున్నారు. వాళ్ళల్లో చిన్న పిల్ల లక్ష్మి. మిగతా ఇద్దరూ లక్ష్మికి అన్నయ్యలు. పెద్దన్నయ్య పేరు గోపి, రెండో అన్నయ్య పేరు హరి. వాళ్ళ అమ్మపేరు శారద. నాన్నగారి పేరు శివరాం.



ఈ చిన్నపిల్లలికి చిన్నప్పట్నించీ పాటలంటే బలేసరదా. వాళ్ళ నాన్నగారుగూడా వాళ్ళకి పాటలు నేర్పుతుండేవారు.

వాళ్లు మద్రాసులో ఉంటున్నారు గదూ ! అందుకని ఎప్పుడూ రేడియోలో 'బాలానందం'లోనూ; వాళ్ల ఇళ్లోనూ నాటకాలూ అవి ఆడుతుండేవాళ్లు.

ఇలా వుంటుంటే వాళ్ల నాన్నగారు ఆఫీసు పనిమీద చాలా డబ్బు తీసుకొని బొంబాయివెళ్తాడు. ఆ డబ్బును కాజేద్దామని కొంతమంది కుట్రపన్నారు. వాళ్లంతా ఆయన దగ్గర డబ్బుకాజేసి, తలమీద బాగాకొట్టి రైలుపట్టాలమీద పడేస్తారు.

మద్రాసులో అంతా లక్ష్మివాళ్ళ నాన్నగారు చచ్చిపోయారని అనుకున్నారు. కాని నిజంగా ఆయన చావలేదు. రైలుక్రిందపడకుండా తప్పించుకుంటాడు. కాని తన ఆఫీసుడబ్బంతా పోగొట్టుకున్నాడు గదూ ! ఇప్పుడుగనక తన ఊరువెళ్లితే తనయజమాని దబ్బదుగుతాడని, అంతా తనను అవమానం చేస్తారని భయబడి మద్రాసు పోవటం మానేస్తాడు.

వాళ్ళ నాన్నగారు లేకపోవటంతో పాపమూపిల్లలు తింటానికి అన్నంగూడాలేక, వాళ్ల అమ్మతో పాటుఎన్నో కష్టాలుపడుతారు. ఇలా ఉంటుంటే 'బాలానంద సంఘం' పిల్లలు బాగా దబ్బిచ్చి గోపికి, హరికి, లక్ష్మికి సంగీతం నేర్పిస్తారు.

పాపం వాళ్లనాన్న ఏవేవో ఊళ్లన్నీ తిరిగితిరిగి చివరకు ఒకచోట పాకీపనివాడుగా చేరుతాడు. ఇలా దాదాపు పంద్రెండేండ్లు గడిచిపోయినై.

గోపి, హరి, లక్ష్మి బాగా సంగీతంనేర్చుకొని పెద్దవాళ్ళయ్యారు. వాళ్ల ప్రతివూళ్లో పాటకచ్చేరీలు చేస్తూ, వాళ్ళనాన్న పాకీవాడుగా ఉంటున్న ఊరికొస్తారు.

ఇంకా కథ చాలావుంది. అంతా చెప్పాలంటే చాలాసేపుపడుతుంది. అందుకని మిగతాకథని మీవూళ్ళో 'నా యిల్లు' సినిమాలో చూడండేం ! 'నా యిల్లు' సినిమాకథ అంతా మీ బాలలదే ! మీరు రేడియోలో వారంవారం పిల్లలకార్యక్రమం వింటున్నారే అదంతా అవరిండియావారి 'నాయిల్లు'లో చూడొచ్చు.



జనవరి విడుదల

నాగయ్య. లింగమూర్తి. రామశర్మ. దొరస్వామి.
రాజకుమారి. గిరిజ. విద్య. నటించిన

అవరిండియా వారి

# నా ఇల్లు

డైరెక్షన్.. నాగయ్య

రచన.. దేవులపల్లి.. ఋడవల్లి..
సంగీతం.... నాగయ్య.. అద్దేపల్లి.....
కెమెరా.. రహిమాన్.. నృత్యం.. వెంపటి..



స్టుడియోస్.. వాహిని. రేవతి.

KRISHNA.

విజయ రిలీజు



నాకు చాలా
ఇష్టమైనవి
కే. సి. పి. వారి కృష్ణ పిప్పరమెంట్లు
ది కే. సి. పి. లిమిటెడ్, ఉయ్యూరు, కృష్ణా జిల్లా.
SISTA'S-K.C-3 TEL

# చందమామ

సంచాలకుడు:
'చక్రపాణి'

ఈ కొత్తసంవత్సరంలో మన చందమామ అన్నివిధాలా సరికొత్త రూపంతో వెలువడటం అందరకూ సంతోష దాయకమైన సంగతికదా. రూపురేఖలలోనూ లోపలి విషయాలలోనూకూడా కొత్తదనం కన్పిస్తుంది. అయితే, అనుకొన్న ఎన్నో విషయాలలో కొన్నిటినిమాత్రమే ఈ సంచికలో ప్రవేశపెట్టగలిగాము. ఇంకా, కొత్తతీరులలో కథలనూ, బుద్ధిబలాన్ని వికసింపజేసే విజ్ఞానవిషయాలనూ, వీటిఅన్నిటికీ మెరుగుపెట్టే చిత్రాలనూ క్రమంగా ఒక్కొక్క సంచికలోనే అందజేస్తాము. ముఖ్యంగా వచ్చేసంచికలో, మీఅందరికీ ఉత్సాహం కలిగించగలిగిన మరికొన్ని చక్కటి శీర్షికలను పెట్టబోతున్నాము. అవి పిన్న పెద్ద లందరికీ విజ్ఞానం అభివృద్ధిచేసుకోవటంలో ఎంతగానో తోడుపడుతవని మా నమ్మిక. మీ అందరి అభిలాషను అనుసరించి 'ఫోటోవ్యాఖ్యల పోటీ'ని ఇంకా కొనసాగించటానికే నిశ్చయించాము.



SANKAR...




# రాజుగారి జబ్బు

రాజుగారికి జబ్బుచేసీ
రాజ్యమంతా దిగులువేసీ
లోకులంతా జబ్బుసంగతి
అబ్బురంగా చెప్పుకొన్నారు.

'వింత రోగం రాజరోగం.
కొంత రోగం, కొంత భోగం,
'కూడు నిద్రల లోటు వుండదు
వుండదేమీ నొప్పి' అన్నారు.

'జబ్బు నా'కని రాజు అంటే
ఎవ్వడేనా 'ఒట్టి'దంటే
పుట్టగతులా ఇంక యిలలో?
అందుకని ఎదురాడలే దెవరూ.

రాజు జబ్బుకి మందు కొదవా,
డబ్బుకూ వైద్యులకు కొదవా?
ఉరుకుతూ వచ్చారు వైద్యులు,
జంకుతో వెనకాడలే దెవరూ.

మందు లిచ్చిందెందరున్నా
తిరిగిపోయినవారు సున్నా.
నయంచేయని వైద్యులందరు
భటులచే ఉరితీయబడ్డారు.

తల్లడిలిపొయ్యారు వైద్యులు
తుదకు కరువయ్యారు వైద్యులు.
ఒక్కరిద్దరు మటు కెలాగో
రాజదూతల వాతబడ్డారు.

రచన:
బైరాగి

ఒకడు రాజుని చూచి 'అబ్బే,
లేదు రాజా! మీకు జబ్బే'
అని అలా పలికాడొ లేదో
రాజు 'ఆఁ - ఊఁ తీయ' మన్నాడు.

అడలి రెండవవాడు 'అయ్యో!
మీకు మిగుల ప్రమాదమయ్యో;
బ్రతుకరొక సుఖశాలి చొక్కా
వేసికొంటేగాని' అన్నాడు.

వెంటనే వెళ్ళారు దూతలు
అంతటా వెదికారు దూతలు
కాని భువిలో సుఖపడే వా
డొక్కడైనా కానరాలేదు.

కడకు భిక్షుకు డొకడు మట్టుకు
సంతసంగా నేలపట్టున
పాడుకోడం చూచి దూతల
అక్కజానికి మేరయే లేదు.

పట్టుకొని వెళ్ళారు వడివడి.
వణుకుతున్నా డతడు గడగడ,
రాజు అతనిని చూచి 'ఓరీ!
ఏది నీ చొక్కాయి?' అన్నాడు.

'దొరా!—చొక్కా నాకు లేద'ని
వాడు అనగా రాజు ఇది విని
సిగ్గుపడి విడిపించి వానిని
'నాకు జబ్బిక రాదు' అన్నాడు.





# అట్ట విరాది బొమ్మ

ధనుర్విద్యలో దిట్ట ద్రోణాచార్యులు. ద్రోణునివద్ద అనేకమంది రాజకుమారులు విలువిద్య నేర్చుకొనేవారు. కౌరవులూ పాండవులూకూడా ఆయన శిష్యులే.

ద్రోణుని శిష్యులలోకల్లా ప్రవీణులు కర్ణుడూ, అర్జునుడున్నూ. ఐతే, కర్ణుడు కురుపక్షపాతి కావటంచేత, అప్పుడప్పుడు అర్జునుణ్ణి పరిహసిస్తూ ఉండేవాడు. ఇటువంటి మత్సరం లేకపోవటంచేతనే, అర్జునుడు గురువుకు ప్రేమ పాత్రుడైనాడు. శిష్యులందరకూ ద్రోణుడు విలువిద్యలో పోటీ పెట్టేవాడు. ఆ పరీక్షలలో తరుచు అర్జునుడే నెగ్గుతూవుండేవాడు. ఇది గురుపుత్రుడైన అశ్వత్థామకుసైతం అసూయకు కారణమయింది.

అసూయ కలిగి అతనేమిచేశాడంటే—'అర్జునుడికి ఎన్నడూ చీకటిలో మాత్రం అన్నం పెట్టవద్దుసుమా' అని తన వంటలవానితో చెప్పాడు. అతని మాటప్రకారమే వంటలవాడు జాగ్రతగా నడుచుకొంటూవచ్చాడు.

ఒకనాటిరాత్రి భోజనాలవుతూవుండగా పెద్దగాలి వచ్చి, దీపం ఆరిపోయింది. అయితే అలవాటుచొప్పున అర్జునుడు ఆ చీకటిలోనే భోజనం చేస్తూవున్నాడు. చేస్తూవుండగా అతనికొక ఆలోచన కలిగింది. 'అలవాటువల్లనేకదా చీకటిలో ఐనప్పటికీ కబళాలు సరిగా నోటికిపోతున్నయి. అభ్యాసంచేసి విలువిద్యమాత్రం చీకటిలో ఎందుకు సాధించలేము?' అని.

ఆనాటినించే అతడు చీకటిలో అస్త్రవిద్య అభ్యసించటానికి ప్రారంభించాడు. శరం సంధించి గురితప్పక అమ్ములను వదలగలిగేవాడు. ఒకరాత్రి అతను సాధకంచేస్తూవుండగా, ఆ ధ్వని వినబడి గురువుకు మెలకువ వచ్చింది.

లేచి చూచి ప్రియశిష్యుడైన అర్జునుని కార్యాసక్తికి ఆయన ఆశ్చర్యపడ్డాడు. అప్పుడు శిష్యుని కౌగిలించుకొని, శిరస్సు నిమిరి, 'అర్జునా! ఈ జగమందు నీకు సాటి అయిన విలుకాడు మరొకడు లేకుండా విలువిద్యలో గల రహస్యాలన్నీ నీకు బోధిస్తాను' అని వాగ్దానంచేశాడు.

ఆ వాగ్దానంప్రకారం ద్రోణుడు సమస్తమైన రహస్యాలు బోధించగా, అర్జునుడు సాటిలేని మేటివిలుకానిగా పేరుగాంచాడు.




# పాడు బుద్ధి

ఒకవూళ్లో పోలయ్య అనే పశువులకాపరి ఒక డుండేవాడు. అతడు చాలా బుద్ధిమంతుడు. పశువుల్ని రోజూ ఊరిప్రక్కన వున్న అడవికి వుదయానే తోలుకుపోయి, సాయంకాలానికల్లా తిరిగి యింటికి తోలుకొచ్చేవాడు.

ఒకనాడు పోలయ్య పశువుల్ని మేతకు వదిలి ఒక చెట్టుకింద కూర్చున్నాడు. సన్నగా వాన పడసాగింది. కాసేపటికల్లా ఉరుములూ మెరుపులూ ప్రారంభమైనై. పెళపెళమనేధ్వనితో పోలయ్యకు ఐదారు గజాల ఎడంగా ఒక పిడుగు పడింది.

పోలయ్యకి కళ్లు బైర్లుకమ్మినై. కొంత సేపటికి ధైర్యంతెచ్చుకుని చుట్టూ కలయ చూశాడు. వాన తగ్గిపోతోంది.

పోలయ్యలేచి ఆ పిడుగుపడిన స్థలం దగ్గిరకు వెళ్ళాడు. పిడుగుపాటువల్ల కాలిపోయిన ఆ స్థలంలో ఏదో మెరుస్తూన్నట్టు కనుపించింది. వంగిచూచాడు. అది బంగారు వుంగరం!

పోలయ్యకు పట్టలేనంత ఆనందం కలిగింది. ఆ వుంగరాన్ని వేలికిపెట్టుకుని చూశాడు. గుండ్రని నీలపురాయి పొదగబడి ఎంతో ముచ్చటగావుంది ఆ వుంగరం. సంతోషంతో తబ్బిబ్బవుతూ పోలయ్య పశువుల్ని తోలుకుని యింటికి బయలుదేరాడు. వేలికి పెట్టుకున్న వుంగరాన్ని సరదాగా కిందికీ మీదికీ తిప్పసాగాడు.

గ్రామాన్ని సమీపించేసరికి యిద్దరు ముగ్గురు గ్రామస్థులు ఎదురైనారు. వాళ్లు పశువులకేసి అనుమానంగాచూసి-'పోలయ్య ఏమయ్యాడు?' అంటూ ఆశ్చర్యపడ్డారు.

పశువుల వెనకనేవస్తున్న పోలయ్యకు వాళ్లమాటలు వింతగా తోచినై. ఆ సమయంలో అతడు వుంగరానికి పొదగబడిన నీలపురాయిని అరిచేతివైపునకు తిప్పివుంచాడు. మళ్ళీ యాదాలాపంగా నీలపురాయిని వేలి పైభాగానికి తిప్పాడు.

"అరే, పోలయ్యా! యింతసేపూ ఎక్కడున్నావ్? యిట్టేమాయమై, యిట్టే కన

సి. హెచ్. మాధవరావు - గుంతకల్లు




బడుతున్నావే!" అన్నారు గ్రామస్తులు. పోలయ్యా ఆ మాటలతో వుంగరంలోని రహస్యం గ్రహించాడు. వుంగరానికివున్న నీలపురాయిని అరిచేతివైపుకి తిప్పితే తను అదృశ్యహౌతాడు. ఎవరికంటికీ కనబడడు.

ఆనాటివరకూ ఎంతో బుద్ధిమంతుడుగా వుంటున్న పోలయ్యాలో యీ వుంగరంలోని రహస్యశక్తి గ్రహించేసరికి, దురాలోచనలు ప్రారంభమయినై. తను చేయదలుచుకొన్న దుర్మార్గపు పనులు ఎవరికంటా పడకుండా చేయవచ్చుగనక, తను యిక ఎవరికి భయపడవలసినపని లేదనుకున్నాడు.

ఆరాత్రి వూరంతా మాటుమణిగిన తర్వాత పోలయ్యా బయలుదేరాడు. వుంగరానికివున్న నీలపురాయిని అరిచేతివైపుకి తిప్పితే ఎవరికంటాపడకుండా వుండగలడు కనక అలాతిప్పకున్నాడు. చేతిలో మాంచి లావైన దుడ్డుకర్ర పట్టుకున్నాడు. సరాసరి నందయ్యాయింటికి వెళ్ళి తలుపుతట్టాడు. ఒకమారు నందయ్యా జొన్నచేను పోలయ్యా పశువులు పాడుచేస్తే, అందుకు నందయ్యా తిట్టాడు. ఆ కోపం తీర్చుకునేందుకు యిదే మంచి అదను అనుకున్నాడు పోలయ్యా.

పోలయ్యా తలుపు తట్టగానే నిద్దరకళ్లతో లేచి తలుపుతెరిచాడు నందయ్యా. గోడ పక్కనే దుడ్డుకర్రతో అదృశ్యుడై నిలబడివున్న పోలయ్యా అమాంతం నందయ్యానెత్తిన దుడ్డుకర్రతో బాదాడు. 'చచ్చాన్రో బాబో!' అంటూ నందయ్యా కూలిపోయాడు.

ఇక అక్కడినుంచి బయలుదేరి పోలయ్యా సరాసరి చిల్లరదుకాణం పెట్టుకు బ్రతికే చలమయ్యా యింటికివెళ్ళాడు.

చలమయ్యా ఇంటితలుపు ఓరవాకిలిగా వుంచి గదిలో కూర్చుని డబ్బు లెక్కపెట్టుకుంటున్నాడు. పోలయ్యా మెల్లిగా తలుపు నెట్టుకుని గదిలోకివెళ్ళాడు. అదృశ్యంగా వున్న పోలయ్యాను చలమయ్యా చూడలేదు కదా? అతడు డబ్బంతాలెక్కించి ఒక మూటగాకట్టి పెట్టెలోపెట్టి ఆపక్కనే నిద్రపోయేందుకు పడుకున్నాడు.





చలమయ్యకు బాగా నిద్రపట్టేవరకు అక్కడే నక్కివుండి తరవాత మెల్లగా పెట్టె తెరిచి అడబ్బులమూట తీసుకుని బయటికి వచ్చేశాడు పోలయ్య. ఇక ఈ రాత్రికిచాలు అనుకుని యింటికివచ్చి నిద్రపోయాడు.

తెల్లవారింది. గ్రామంఅంతా నందయ్య తల పగలటాన్నిగురించీ, చలమయ్య డబ్బు పోవడాన్ని గురించీ వింతగా చెప్పుకోసాగారు. పోలయ్యకూడా ఏమీతెలీనట్టు వాళ్ళతో చేరి 'ఆఁ అలాగా! వింతగావుందే!' అంటూ తనలోతాను నవ్వుకో సాగాడు.

తనకుదొరికిన వుంగరం సహాయం చేత పగలైనా ఎవరికంటా పడకుండా వుండగలడు గనక పోలయ్య ఇప్పుడు పట్ట పగలే దొంగతనాలకు తయారైనాడు.

మెడనిండా నగలుపెట్టుకుని చెరువుకు నీళ్లకోసం వెళ్తున్న ఇద్దరుముగ్గురు స్త్రీలను చూసి—'నాపంటపండిందిలే' అనుకున్నాడు పోలయ్య. అదృశ్యంగా వాళ్లను సమీపించి వాళ్ళ మెడల్లోని బంగారు గొలుసులన్నీ తెంచుకున్నాడు. 'దొంగ, దొంగ!' అని ఆ స్త్రీలు అరిచినా కనపడని ఆ దొంగను ఎవరూ పట్టుకోలేకపోయారు.

పట్టపగలే యింత ఘోరం జరిగేసరికి ఆ గ్రామస్తులంతా హడలిపోయారు. ఎవరికీ ఏంచేసేందుకూ తోచలేదు. కనపడని దొంగను ఎవరుమాత్రం ఏంచేయగలుగుతారు? పోలయ్య ఇక తన దెబ్బకు తిరుగు లేదనుకున్నాడు.

పశువుల కాపరి పోలయ్య క్రమేణా పగటిచుక్క - రేచుక్కల్లాంటి గజదొంగగా మారిపోయాడు. అడవికి తోలిన పశువుల్ని అడవిలోనే వదిలేసేవాడు. ఇష్టం వచ్చినంతసేపు నిద్రపోవడం, ఆకలైనప్పుడు అదృశ్యంగా ఏయింట్లోనో జొరబడి కడుపు నిండామెక్కడం, పట్టపగలే నిర్భయంగా దొంగతనాలుచేయడం, నిత్యకృత్యం అయిపోయింది.

ఇలా కొన్నాళ్ళు జరిగేసరికి, యిక ఆ చిన్న గ్రామంలో తను దొంగిలించదగిన విలువైన వస్తువులేవీ పోలయ్యకు కనబడ

లేదు. పక్క గ్రామపు జమీందారుకోటలో నగానట్రా దొరుకుతుందని అతడికి తెలుసు.

ఆ మరునాడే పోలయ్య అదృశ్యంగా కోటలో జొరపడ్డాడు. ఎక్కడెక్కడ ఏమేమి ఉన్నయో చూచుకున్నాడు. రోజు కొక చోటుచొప్పున ధనాగారంలోని డబ్బుతో మొదలుపెట్టి, రాణివాసంలోని స్త్రీల నగలూ, చీరలూ దొంగిలించసాగాడు.

కోటలో హాహాకారాలు బయలుదేరినై. ఎంతమందిని కాపలా పెట్టినా, ప్రయోజనం లేకపోయింది.

ఒకనాడు పోలయ్య కోటలో ప్రవేశించే సరికి అంతా గుసగుసలాడు కుంటున్నారు. 'కోటలోని విలువైన ఆభరణాలూ వస్తువులూ, అన్నీ ఒక గదిలో పెట్టి బలమైన కాపలా పెడతారు' అని.

పోలయ్యకు యీ వార్త మంచిఉత్సాహాన్ని కలిగించింది. కోట అంతా గాలించేకన్న, అన్నీ ఒకే గదిలోకివస్తే దొంగిలించడం సులువు అనుకున్నాడు. చీకటి ఎప్పుడు పడుతుందా అని కనిపెట్టుకు కూర్చున్నాడు.

చీకటిపడింది. జమీందారూ, దివానూ ఒక పెద్ద యినపభోషాణాన్ని పట్టించుకుని వచ్చి ఒక గదిలో పెట్టించారు. వేచిఉన్న పోలయ్య గదిలో ఒకమూల నక్కాడు.

కాసేపటికల్లా తలుపులు బిగించి జమీందారూ, దివానూ వెళ్ళిపోయారు. పోలయ్య మారుతాళపుచెవితో భోషాణాన్ని తెరిచాడు. ఆశ్చర్యం! అందులో పూచికపుల్లకూడా లేదు.

వాడు మోసపోయానని గ్రహించాడు. ఐనా తెల్లవారి తలుపులు తెరిచినతరువాత బయటికి వెళ్ళవచ్చుని ధైర్యంగా కూర్చున్నాడు. పాపం, వాడికి జమీందారూ, దివానూ వేసిన ఎత్తు తెలీదు.

తెల్లవారింది, చీకటిపడింది. మళ్ళీ తెల్లవారింది, మళ్ళీ చీకటిపడింది. అలా ఎన్నో పగళ్ళూ, రాత్రులూ గడిచినై. కాని ఆ తలుపులు ఎవరూ తెరవలేదు.

ఆకలిదప్పులతో అటమటించి, తనపాపం పండినందుకు ఏడుస్తూ, ఆ గదిలోనే కృశించి కృశించి మరణించాడు పోలయ్య.






## 3

సరీగా అర్ధరాత్రప్పుడు, గాఢనిద్రలో వున్న మందపాలుణ్ణి ఎవరో లేపినట్టయింది. చూస్తే, అతనొక సన్యాసి! ఉలిక్కిపడ్డాడు మందపాలుడు. సన్యాసి అతని బుజం పట్టుకొని, "ఉష్!- అవతలికి పోయి మాటాడుకుందాం, రా!" అంటూ, వెంట తీసుకుపోయాడు. కంఠస్వరాన్నిబట్టి ఆ సన్యాసి యెవరయిందీ వెంటనే తెలుసుకొన్నాడు మందపాలుడు.

తన గుర్రాన్ని నడిపించుకొని మందపాలుడు సన్యాసివెంట పోతూవుంటే, గుబురుగా పెరిగిన చెట్లపరుస కనిపించింది. ఆ చెట్లసందుకు పోయి, సన్యాసి తనూ ఒక గుర్రాన్ని తీసుకువచ్చాడు. అప్పుడు ఎవరి గుర్రాన్ని వాళ్ళుఎక్కి, దౌడుతీస్తూ ఒక యేకాంతప్రదేశం చేరుకున్నారు.

"గురూ!- ఈ విడిదిలో మీకసలు ప్రవేశం ఎలా దొరికింది? ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటి?" అని అడిగాడు ఆశ్చర్యంతో మందపాలుడు.

"పసివాడివి నీకేం తెలుసు? ఎక్కడికి వెళ్ళాలన్నా సన్యాసికి అడ్డులేదుగా! ఇన్నాళ్లనించీ నేను పెంచిన గడ్డం ఇప్పుడు పనికివచ్చింది. దానికేం-మీ భల్లాటరాజుకు చేరిన తాఖీదు సృష్టించింది ఎవరో తెలుసా, ఇంతకూ? సామంతరాజులందరినీ మంత్రించినట్టు కట్టివేశా. 'మాకు స్వాతంత్ర్యం కావాలి. మందపాలుడే భల్లాటరాజ్యాధిపతిగా ఉండాలి' అని అందరి నోటా అనిపించా. అందరిలోనూ ఒక్క మీ తాత, అర్ధకర్ముని మామ—సామంతుడూ మగధదేశరాజూ ఐన ఆ అమరభూపతి మాత్రం




ఏదో విరసంగా మాటాడుతున్నాడట. కానీ, అతను కలిసిరాకున్నా మరేం ఫరవాలేదు," అన్నాడు, హుంకరిస్తూ రాజగురు.

"నేనిక్కడ వున్నట్టు మీకెలా తెలిసింది గురూ!" అని మళ్ళీ అడిగాడు మందపాలుడు ఆత్రంతో.

అందుకు రాజగురు, "అమాయకుడా!– ఈమాత్రం తెలుసుకోలేనా? మన ఏర్పాటులన్నీ కాగానే సరాసరి ఇంటికి వెళ్లాను. నీవు ఘూర్జరదేశానికి రాయబారిగా వెళ్ళుతావని తెలిసి, వెంటనే గుర్రంమీద బయలుదేరా. భల్లాణరాజ్య సేనాధిపతి ఐన మావాడే నీ జాడలు చెప్పాడు."

ఈ మాట వినగానే, మందపాలుడు తన రాయబారపు భోగట్టాలన్నీ పూసగుచ్చినట్టు వెల్లడించాడు.

అంతా విన్నాడు, రాజగురు. "సరే, నీ విక ముందుకు పోవద్దు. ఇక్కడినుండే మళ్ళిపో. ఘూర్జరదేశ ప్రభువును కలుసుకొన్నానను. రాయబారానికి జవాబుగా ఇలా చెప్పు: 'కిరీటమనేది రాజచిహ్నం. అది రాజకీయానికి సంబంధించినదే కాని, కుటుంబవిషయం ఎంతమాత్రమూ కాదు. తరతరాలుగా వస్తున్న రత్నకిరీటం ధరించినప్పుడే భల్లాణరాజులకు మేము కైమోడ్పు చేసి కప్పం కడతాము. లేకుంటే లేదు. నిర్బంధం చేస్తే యుద్ధానికి సిద్ధమే' అను.

"ఏదోవిధంగా కయ్యానికి కాలు దువ్వి, పురెక్కించు. వాళ్లను రంగానికి దింపటం నీవంతు, తక్కిన పని అంతా నావంతు" అని చెప్పి, రాజగురు వెళ్ళిపోయాడు.

మందపాలుడు వెళ్ళింది మొదలు, ప్రమోదుడూ కిరాతరాజూ యెదురుచూస్తూనేవున్నారు. అనుకొన్నకంటె ముందుగానే వచ్చేశాడు, మందపాలుడు. అతను అడుగుపెట్టీ పెట్టడంతోనే ఆత్రంతో 'ఏమయింది?' అని అడిగారు, వారిద్దరూ.



"ఏమయింది! అక్కడికి వెళ్ళిన నాకూ, నన్ను పంపిన మీకూ, తీరని అవమానం జరిగింది. రాయబారినైన నన్ను గౌరవించటానికి బదులు, బంధుత్వాలు ఏకరుపెట్టి, నానా మాటలూ ఆడిపోశారు. ఆ మాటలు కావాలన్నా నోట పలకలేము. సామంతు లందరి తరఫునా పెద్దనని చెప్పి, పిచ్చికూతలు కూసే ఆ ఘూర్జరరాజును తల కొట్టి మొలవేయాలి, నాకు నిద్రపట్టాలి. యుద్ధసన్నాహాలు చేయండి ఇప్పుడే. నేను పోయి, మావాళ్లను తయారులో వుంచుతా" అంటూ, మందపాలుడు కిరాతరాజ్యానికి ప్రయాణమయ్యాడు.

మందపాలుడు చెప్పిన ఒక్కొక్క మాటకూ ప్రమోదునికి పౌరుషం రేగి, రగులుకువచ్చింది. 'ఆ ఘూర్జరుడికి ఎంత సాహసం! యుద్ధమంటే ఏమో అనుకొన్నట్టుంది. రుచి చూపిద్దాం!' అన్నాడు పట్టరాని అహంకారంతో, ప్రమోదుడు.

ఇప్పుడు ప్రమోదుని మనస్సు పరిపరి విధాల పోయింది. 'మందపాలుని సైన్యం ఉండనేవున్నది. అదిగాక, మగధదేశాధిపతి–అర్ధకర్ముని మామ ఒకడున్నాడుకద! ముందు అతనికి రాసి సాయం కోరాలి' అనుకొన్నాడు. కిరాతరాజును సలహాచేసి అక్కడికి ఒక నమ్మకస్థుణ్ణి వెంటనే రాయబారిగా పంపాడు.

కిరాతరాజ్యం చేరుకొన్న మందపాలుడు తన కోయవాళ్లందరికీ తరిఫీదు ఇవ్వటానికి తగినవాళ్లని నియమించాడు. తరువాత, భల్లాణరాజ్యానికి తిరిగివస్తూ, ఒక రాజ విడిదిలో దిగాడు. మగధదేశానికి బయల్దేరిన రాయబారికూడా ఆ సమయంలో ఆ విడిదిలోనే మకాంచేయటం తటస్థించింది.

మాటా పలుకూ ఆడుతూ, రాయబారిని జాబు చూపమన్నాడు, మందపాలుడు. అతడు సందేహించాడు. అప్పుడు మంద




పాలుడు, రాజముద్ర గల ఉంగరం చూపగా రాయబారి ఉత్తరం ఇవ్వక తప్పలేదు.

మందపాలుడు తెరిచి చూచాడేకాని, ఉత్తరంలో ఒక్క ముక్క అర్థంకానేలేదు. అవన్నీ రహస్యపు సంజ్ఞలు !! కావాలంటే అతను అధికారబలం చూపి ఉత్తరం తీసుకోనేవచ్చు. కాని గొడవ పడదలచుకో లేదు. తిరుగుదలలో జవాబు తెస్తాడుకదా, అప్పుడు చూడవచ్చునని తలిచి, ఆ విడిది లోనే ఎదురుచూస్తూ ఉండిపోయాడు.

తీరా, రాయబారి మగధకు వెళ్ళేసరికి, అమరభూపతి తండ్రి మరణశయ్యమైన వున్నాడు. నాలుగు రోజులయిన తరవాత గాని ఆ జాబు అందుకోనేలేకపోయాడు, అమరభూపతి. అందుకొని, వెంటనే అనుకూ లంగా జవాబు వ్రాసి పంపాడు. ప్రత్యుత్తరం పట్టుకొని రాయబారి భల్లాణరాజ్యం చేరు కొన్నాడు. జవాబు చూచుకొని ప్రమో దుడు పరమానందభరితుడైనాడు.

రాయబారికోసం విడిదిలో వేచిఉండి, మందపాలుడు విసిగిపోయాడు. 'వీడు టక్కరి. మరొకదారిని తప్పించుకు పోయి వుంటాడు' అని అనుమానించి, భల్లాణ రాజ్యం పోకుండానే ఇంటిముఖం పట్టాడు. ఏమంటే, తను ఇక్కడ రాయబారి కోసం కనిపెట్టుకొనివుండగా, రాజగురు ఒకవేళ తనకోసం యింటికి వచ్చాడేమో ?

మందపాలుడు ఇంటికి వెళ్లేసరికి నిజంగా రాజగురు రానే వచ్చాడు. రాయ బారినిగురించిన వృత్తాంతం అంతా విని, "సరే, మంచిపనే చేశావు. ఏమైనా, మనం చాలా జాగర్తగా ఉండవలసిన సమయం సుమా ఇది. ఏర్పాట్లన్నీ చేసేవచ్చాలే" అని హెచ్చరించాడు.

ఏమయితేనేం, పోరు పొసగింది. యుద్ధం సిద్ధమయింది. ఫలానారోజున ఇన్నిగంటల ఇన్ని నిముషాలకు సరీగా, ఫలానా మైదా



నంలో తలపడాలి అని ప్రకటన జరిగింది. ఇరుపక్షాలలోనూ అతిచురుకుగా యుద్ధ ప్రయత్నాలు సాగిపోతున్నాయి.

భల్లాణరాజ్యప్రజలు సంతోషంతో యుద్ధానికి తొడుపడసాగారు. ఏవిధంగా చూచినా వారిబలం అనుకూలంగానే కనిపించింది.

యుద్ధారంభం కావలసిన ఆ రోజూ, ఆ గంటా, ఆ క్షణమూ వచ్చింది. మైదానానికి నడుమ బారులుతీర్చి, తయారుగా వున్నాయి భల్లాణరాజ్యసేనలు. చూస్తే, సామంతుల సేనలు పలచపలచగా కనబడినై. ప్రమోదునికి ధైర్యంచిక్కింది.

యుద్ధం ముమ్మరమయింది—

మంచి సమయంలో భల్లాణరాజ్య సేనాధిపతి వెనక్కు తగ్గాడు. వస్తానన్న అమరభూపతి సాయంరాలేదు. పైగా, వచ్చిన కోయదళాలేమో ఎదురుతిరిగి సామంతుల సైన్యాలతో చేరిపోయినై. ఈవిధంగా, అన్ని కారణాలవల్లా భల్లాణ రాజ్యానికి అపజయమే కలిగింది.

భల్లాణ సైనికులు చెల్లాచెదరు కావటంతో, ప్రమోదుడు ఒంటిపాటు ఐపోయాడు. ఇంతవరకూ ఒక కోయవానిగా కనబడుతూ వచ్చిన రాజగురు, విచ్చలవిడిగా తిరుగులాడే మందపాలుని పిలిచి "చూస్తావేం? బంధించు ప్రమోదుణ్ణి" అని అజ్ఞాపించాడు.

ఏమీ పాలుపోక నిలుచుండిపోయాడు మందపాలుడు. "ఊం! ముందు బంధించు. చుట్టరికం చూస్తేకాదు" అని గద్దించాడు రాజగురు. ఎదురాడలేక, మందపాలుడు వెంటనే ప్రమోదుణ్ణి ఖైదు చేయించాడు. అప్పుడు తన కోయవేషం విప్పేసి, రాజగురు వికటంగా నవ్వాడు. ప్రమోదునికి పట్టరాని కోపమూ, దుఃఖమూ ఒక్కసారిగా కలిగినై. అదే సమయంలో, కిరాతరాజూ అర్ధకర్ముడూ కనిపించటం

లేదని ఒక వార్త వచ్చింది. ఇందుకు దిగ్భ్రమ చెందాడు మందపాలుడు. 'సరే, చూదాంలే' అన్నాడు, నిబ్బరంగా రాజగురు.

అంతలో—కొంతదూరాన ఏదో సైన్యం వస్తూన్న అలికిడి ఐంది. చూడగా, అది మగధరాజు సైన్యమే. అంతా తిరినతరువాత యిప్పుడు వచ్చాడు, అమరభూపతి. వచ్చి, స్థితిగతులన్నీ తెలుసుకొన్నాడు. భల్లాణ రాజ్యానికి సాయపడలేకపోయినందుకు చింతించాడు. కానైతే, తోడి సామంతులతో వైరం పెట్టుకోదలచలేదు. సమయానికి అందుకోలేకపోవటానికి తండ్రిజబ్బు సాకుపెట్టి, యుక్తిగా తప్పించుకున్నాడు.

ఈ వాలకమంతా కనిపెట్టుతూవున్న ప్రమోదుడు అమరభూపతిని చూచి 'ద్రోహీ!' అనిమాత్రం అని ఊరకొన్నాడు.

ఇంకిప్పుడు మందపాలుని పట్టాభిషేక మహోత్సవం చూడటానికని అందరూ భల్లాణరాజ్యం చేరుకున్నారు. అందరూ కనిపిస్తున్నారుకాని, ఎంత వెతికినా అర్థ కర్ముని భార్యా, ఆమెకొడుకు చిత్రభానుడూ కనిపించలేదు. అంతఃపురంలో వెతికారు, శయ్యామందిరంలో వెతికారు. మరెక్కడనో వెతికారు. వాళ్లు కనిపించనేలేదు.




మందపాలుడు విస్తుపోయాడు. రాజగురు యోచనలో పడ్డాడు. రాజులందరూ నిశ్చేష్టులైనారు. తల్లినీ, కొడుకునూ వెతికి పట్టమని వేగిరపెడుతూ ఆజ్ఞాపించాడు రాజగురు. నిలుచున్నపాటున భటులు బయలుదేరి, నలుదిక్కులకూ గబగబ పరుగులెత్తారు.

ఎప్పుడైతే ప్రమోదుణ్ణి ఖైదుచేశారని తెలిసిందో, ఆక్షణమందే అర్ధకర్ముడి భార్య తన రాణీదుస్తులు తీసివేసింది. ఒక దాదిగా తయారయింది. కొడుకు చిత్రభానుడికి వికారంగా మసిపూసి ఒక పేదబాలునిలా కనబడేటట్టు చేసింది. ఇలా మారువేషంలో

వుండి, తమను ఎవరూ అనుమానించ కుండా తప్పించుకొని, చాకచక్యంతో కోటలో నుంచి బయటపడింది.

బయటపడిందేకాని, ఆ క్షణంనుంచీ పాపం, ఆమెకు కలవరపాటు ఎక్కువే అయింది. ఐదేళ్ల పసివాణ్ణి వెంటబెట్టుకుని పరుగెత్తవలసి వచ్చింది. ఎండకన్నెరుగని సుకుమార ప్రాణి ఎంతకని పరుగెత్తగలదు! వెళ్లి వెళ్లి, కొంతదూరంలో ఒక చెట్టుకింద సొలిపోయింది. కుర్రవాడు ఆమెను కది లించాడు. ఎంతకూ ఆమె లేవలేదు. ఏమీ తోచక "అమ్మా! అమ్మా!!" అనుకొంటూ, ఒక దారీ తెన్నూ లేకుండా, కాళ్లు ఈడ్చుకుపోయినంతవరకూ పసివాడు కంగారుతో పోసాగాడు.

అలా కుర్రవాడు పోయిన మరికొద్ది సేపటికల్లా భటులు వెతుక్కొంటూ ఆచోటికి వచ్చారు. వచ్చినవారిలో ఒకడు అర్ధకర్ముని భార్యను ఇట్టే గుర్తుపట్టేశాడు.

భటుల అలికిడికి ఆమె లేచింది. లేస్తూనే, పసివాడు కనబడక, వెతకనారం భించింది. ఆ భటులే వానిని ఏమో చేసి వుంటారనుకొని ఆమె, "ఏడీ, నా చిత్ర భానుడేడీ, చెప్పండి! చెప్పండి!!" అంటూ ఒక్కపెట్టున విలపింపసాగింది. కుర్రవాడిని దాచివేసి ఆమె మాయచేస్తున్నదని వాళ్లు అనుమానించారు. "కుర్రవాడు ఏడీ? ఎక్కడ దాచావు, చెప్పు" అంటూ ఆమెను గద్దింపసాగారు.

చివరకు వాళ్లు, ఆమెను పట్టి తీసుక పోయి, రాజగురు ఎదుట నిలబెట్టారు. రాజ గురు ఉగ్రుడయ్యాడు. "ప్రమోదుణ్ణి వేసిన గది పక్కనే దీనినీ పడవేయండి. పట్టాభి షేకం కాగానే చూచుకోవచ్చు. మాయల వాడు చిత్రభానుణ్ణి పట్టండి. ఆ దుర్మార్గుడు కిరాతరాజునీ అర్ధకర్ముణ్ణీ కూడా వెతకండి. శత్రుశేషం ఉండకూడదు" అన్నాడు కఠోరంగా. అప్పుడు— [ఇంకా వుంది]



# భూగోళవృత్తాంతం మీకేపాటి తెలుసు?

[ ఈ పరీక్షకు నియమించిన కాలం : పదిహేను నిముషాలు ]

రెండు ప్రపంచయుద్ధాలలో పాల్గొని, కోట్లకొలది డబ్బు ఖర్చుచేసిన అమెరికా దేశస్థులే యూరప్‌రాజ్యాలలో ఏరాజ్యం ఏదో చెప్పకోలేకపోయారంటే చిత్రంగా లేదూ? కాని యిది మాత్రం నిజంగా జరిగింది :

వివిధప్రాంతాలలో నివసించేవారికి ఈ దిగువనున్న యూరప్ పటాన్ని అచ్చు వేయించి యిచ్చారు. అందులో అంకెల గుర్తులున్న దేశాలలో 12 దేశాల పేర్లు చెప్పకోమన్నారు. దాదాపు కాలేజీచదువు వచ్చినవారు 7 దేశాలపేర్లు మాత్రమే




చెప్పగలిగారు- హైస్కూలుచదువు నేర్చినవారు 6 దేశాలపేర్లు పోల్చుకోగలిగారు. గ్రేడెడ్ స్కూళ్ళలో చదివినవారు 3 దేశాలపేర్లు మాత్రమే చెప్పగలిగారు. అనగా సగటున ఒక్కొక్కరు, మ్యాప్‌లో ఇచ్చిన 12 దేశాలకిగాను 5 దేశాలపేర్లు మాత్రమే చెప్పకోగలిగారన్నమాట! ఇక్కడ మ్యాపులో పన్నెండు దేశాలపేర్లూ, వాటి కెదురుగా గీతలూ వున్నై. పైనున్న పటంలో ఆయా దేశాలకు చెందిన అంకెలు ఏవో పోల్చుకుని ఆ అంకెలు ఈ గీతలలో వేయాలి.

ఉదాహరణకి : పటంలో 16 అంకె వున్నది రష్యాదేశం. ఇలానే అట్లాసు సహాయం లేకుండా ఈ పరీక్షలో నెగ్గగలవేమో ప్రయత్నించిచూడు.

[జవాబులు 58 పేజీలో]

# తపాలాబిళ్ళ బెజ్జాలు ఎలా ఏర్పడినై?

ఇది వందసంవత్సరాల క్రిందట జరిగిన సంగతి: ఆ రోజుల్లో తపాలాబిళ్ళల కాగితాలలో యిప్పటిలాగా ఒకబిళ్ళకీ మరొకబిళ్ళకి మధ్య బెజ్జాలు వుండేవి కావు. ఒకబిళ్ళ తియ్యాలంటే కత్తెరతోనో చాకుతోనో కత్తిరించాల్సివుండేది. ఒకనాటిరాత్రి ఒక పత్రికావిలేఖరి ఒక హోటల్‌గదిలో కూర్చుని, ఆ మరునాడు తన పత్రికకు పంపవలసిన వార్తలు వ్రాస్తున్నాడు. వ్రాయటం పూర్తిఅయాక, ఆ కాగితాలని ఒక కవరులో పెట్టి అతికించాడు. తరువాత, జేబులోనించి తపాలాబిళ్ళల కాగితం ఒకటి తీశాడు. చాకుకోసం జేబులో వెతికాడు. కాని ఎంతకూ కనుపించిందికాదు. అప్పుడు తన కోటుకాలరుకి గుచ్చివుంచిన ఒక గుండుసూది తీసి, దానితో తపాలా బిళ్ళచుట్టూ బెజ్జాలు పొడవసాగాడు.

ఇంతలో, అదేహోటల్లో వుంటున్న అతని స్నేహితుడు (హెన్రీ ఆర్చర్) అక్కడికి రావటం సంభవించింది. అతను వస్తుతహా మెకానిక్కు. తనస్నేహితుడు చేస్తున్నపని చూచేసరికి ఆర్చర్‌కి మెరపులాంటి ఒక ఆలోచన తట్టింది. తపాలాబిళ్ళల్ని వేరు వేరు చెయ్యటానికి ఏదైనయంత్రం తయారుచేయాలని నిశ్చయించుకున్నాడు.

మరికొద్ది రోజులకల్లా ఒకయంత్రం తయారుచేశాడు. కాని బ్రిటిషుతపాలాశాఖ వారు ఆ యంత్రం పనికిరాదన్నారు. అయినా ఆర్చర్ పట్టు విడువలేదు. తన తెలివి తేటలతో మరికొన్నిమార్పులు చేసి, యింకొకయంత్రం తయారుచేశాడు. కాని యిదీ పనికిరాదన్నారు తపాలాశాఖవారు. మరికొంతకాలం కృషిచేశాడు ఆర్చర్. దాని ఫలితంగా 1848 లో అతను తయారుచేసిన యంత్రాన్ని తపాలాశాఖ వారు ఆమోదించారు. అయితే, ఈయంత్రం వెంటనే వాడుకలోకి రాలేదు. మరి కొన్ని చేర్పులు మార్పులు చేశారు. ఇప్పుడు మనం చూచే తపాలాబిళ్ళలాంటివి మొట్టమొదటగా ఈ యంత్రంమీదనే తయారై 1854 సంవత్సరాన ఇంగ్లండులో వాడుకలోకి వచ్చినై. ఆ తరువాత యితరదేశాలలో కూడా వాడుకలోకి వచ్చినై.

తన చాకు కనుపించక అవస్థపడుతున్న ఒక పత్రికావిలేఖరిని తలవనితలంపుగా హెన్రీఆర్చర్ చూడటం సంభవించటం, దాని ఫలితంగా ఈ రోజున మనం వాడే బెజ్జాలు గల తపాలాబిళ్ళలు వాడుకలోకి రావటం చిత్రంకాదూ?




అనేక వందల ఏళ్ళక్రితం ఒకానొకదేశంలో కళాధరుడనే చిత్రకారుడుండేవాడు. వారిది గొప్ప చిత్రకారులవంశం కావటంచేత ఆవంశంవారికి అనాదిగా రాజాశ్రయం ఉంటూవస్తున్నది. తండ్రి వయసు ముదరకుండానే అకస్మికంగా మరణించటంవల్ల కళాధరుడు ఇరవైసంవత్సరాల వయసులోనే అంతఃపుర చిత్రకారుడుగా నియమించబడ్డాడు. ఈవిధంగా నియమించబడిన కొద్దిరోజులకే అతనికి అతిముఖ్యమైన పనికూడా తగిలింది.

ఏమంటే రాజుగారికి పద్దెనిమిదేళ్ళ కుమార్తెఉన్నది. ఆమెకు వివాహయత్నాలు జరుగుతున్నాయి. రాజదైవజ్ఞులు ఆమె జాతకం పరీక్షించి, అతిత్వరలోనే రాజకుమార్తె నవమన్మథునివంటివాణ్ణి చేపట్టబోతున్నదని తెలిపారు. వారిమాట కాదనటానికి లేదుగనక రాజుగారు కళాధరుణ్ణి పిలిపించి, తన కుమార్తెఅయిన ప్రేమవతి చిత్తరువులు రెండు మూడుడజన్లు తయారుచేయవలసిందిగా ఆజ్ఞాపించాడు.

ఒకరోజల్లా అంతఃపురంలో గడిపి, రాజకుమార్తె స్నానానికి ఆయత్తమయేటప్పుడూ, జలకాలాడి అలంకరణ చేసుకునేటప్పుడూ, సంగీతసాధన చేసేటప్పుడూ, వనవిహారం చేసేటప్పుడూ ఆమె వెంట ఉండటానికి కళాధరుడికి అనుమతి లభించింది.

ప్రేమవతిది కుశాగ్రబుద్ధి. తాను త్వరలో నవమన్మథుణ్ణి చేపట్టనున్నదని జ్యోతిష్కులు చెప్పినప్పుడు, వారు తన తండ్రిని సంతోషపరచటానికి అతిశయోక్తులాడారనుకున్నది. కాని కళాధరుణ్ణి చూడగానే జోస్యం నిజంకాబోతున్నదని ఆమె తెలుసుకున్నది. ఎందుకంటే, కళాధరుడు తక్కువవాడు కాడు, నవమన్మథుడే. తన చిత్తరువులు చూసి తనను పాణిగ్రహణం చేయబోయే రాజకుమారులలో కళాధరుడికి సాటివచ్చేవాడుంటాడని ఆమె నమ్మలేకపోయింది.

రాజకుమార్తె అయిన ప్రేమవతీదేవి తనపట్ల ఎంతో దయగాఉన్నట్టు కళాధరుడు తెలుసుకొని, ఆమె చిత్తరువులను ఎంతో శ్రద్ధగా చిత్రించి ఆమెమెప్పు పొందాలని

కొడవటిగంటి కుటుంబరావు



నిశ్చయించుకున్నాడు. అమె చూస్తుండగానే ఒక చిత్తరువు తయారుచేశాడు. ఏవైతే పద్మినీజాతిలక్షణాలని తన గురువులు చెప్పారో ఆ లక్షణాలన్నీ చిత్తరువులో చూపాడు. ఆ చిత్తరువు ప్రేమవతిదని పోల్చుకోవటానికి వీలుగా అమెగుర్తులు ఒకటిరెండు చిత్రించాడు!

చిత్తరువునుచూసి ప్రేమవతి, "ఆహా! ఈ చిత్తరువులోని మహోన్నత భావాలకు నేనే కారణమైతే ధన్యురాలను!" అన్నది. కళాధరుడు సంతోషంతో పొంగిపోయినాడు.

అతను ఆ సాయంకాలం ఇంటికి తిరిగి పోయేటప్పుడు ప్రేమవతి అతనికొక సలహా ఇచ్చింది:

"నీవింకా యువకుడవు. చిత్తరువులను శ్రద్ధగా, విశ్రాంతిగా చిత్రించాలి. క్షణంలో ఇట్లా పూర్తిచేయగూడదు. నా చిత్తరువులు శాశ్వతంగా ఉండాలంటే వాటిని నీవు అనేక మాసాలపాటు శ్రమపడి తయారుచేయాలి. తెలిసిందా? రేపు మళ్ళీ రా!"

కళాధరుడు, "చిత్తం!" అన్నాడు.

మర్నాడు రాజకుమార్తె చిత్రకారుణ్ణి మరింత మక్కువగా చూసింది. అతని చేతనే అలంకరణ చేయించుకొన్నది. అతనితో చదరంగం ఆడింది. అతనికి అభిమానమైన పాటలు పాడింది. చెలికత్తెలెవరూ వెంటరాకుండా అతన్ని ఉద్యాన వినోదానికి తీసుకుపోయింది. అతనికి భోజనంపెట్టి, కొత్తబట్టలూ ఆభరణాలూ ఇచ్చి ఆరాత్రి ఇంటికి పంపింది.

కళాధరుడికి ప్రణయజ్వరం పట్టుకున్నది. అతనికళ్ళకు ప్రేమవతి చిరునవ్వు తప్ప మరేమీ కన్పించలేదు. అమెపాడిన పాటలు అతనిచెవులలో రింగుమంటున్నవి. అమెవెంటవున్న క్షణాలుతప్ప మిగతా కాలం వ్యర్థంగాతోచింది. తపన భరించలేక ఇంట్లో నుంచి బయటికి వచ్చాడు. మలయానిలం వీస్తున్నది. పూర్ణచంద్రుడు ఆకాశాన ప్రకాశిస్తున్నాడు. ఏ చెట్టుమీదినుంచో గండు కోయిల కూసింది. అన్నిటినీ శపించాడు.

తానెక్కడ, రాజకుమార్తె ప్రేమవతీదేవి ఎక్కడ? తానామెను మోహించటమేమిటి? ఆమెకు తనపై ఇంత వాత్సల్యం ఎందుకు కలగాలి?

మర్నాడు అతను కుష్కించివున్నట్టు ప్రేమవతి గమనించి కారణం అడిగింది. కళాధరుడు గుండె రాయిచేసుకుని తన మోహాన్ని వెళ్ళబెట్టాడు. ప్రేమవతి ఆగ్రహించలేదు. సానుభూతి చూపింది.

ఏడుస్తూవుంటే అతని కన్నీరు తన పైటచెంగుతో తుడిచింది. అతని జుట్టు నిమిరింది. శైత్యోపచారంకూడా చేసింది. ఎంతచేస్తేయేమి?

జ్యోతిష్కుల అమోఘవాక్కు ఈవిధంగా ఫలించింది. ప్రేమవతి కళాధరుల ప్రణయం కొద్దికాలం నిర్విఘ్నంగా కొనసాగింది. అయితే కొద్దికాలంమాత్రమే.

కళాధరుడు అంతఃపురం ప్రవేశించినప్పుడు అతని సౌందర్యం ప్రేమవతిని ఒక్కతెనే ఆకర్షించలేదు. ఆమె చెలికత్తెలలో చాలామంది అతన్ని చూస్తూనే మన్మథబాణాలకు గురిఅయినారు. అందులో చపల అనేది గొప్పసాహసురాలు. కళాధరుణ్ణి తనవశంచేసుకోవటానికి ఆమె చాలా వ్యూహాలు ఆలోచించిపెట్టింది. వాటన్నిటినీ రాజకుమార్తె భగ్నంచేసింది. ఈ చపల



సమయంకోసం కనిపెట్టిఉండి రాజుగారితో కళాధరుడి ఉదంతం చెప్పేసింది. అంతేగాక అతన్ని పట్టుకునేందుకు ఉపాయం కూడా చెప్పింది.

ఒకనాటి సాయంకాలం ప్రేమవతి చక్కగా అలంకరించుకొని తన ప్రియుణ్ణి కలుసుకొనటానికి బయలుదేరబోతుండగా మంత్రిగారు వచ్చి, "అమ్మా, కొంతమంది రాజకుమారుల చిత్రపటాలు తెప్పించాను. తమరు వాటిని చూడాలి" అన్నాడు.

"రేపు చూస్తాను!' అన్నది ప్రేమవతి.

"రేపూ ఎల్లుండీ అష్టమి నవములు. మరి రెండు ఘడియలలో వర్జ్యకాలం వస్తుంది. ఇప్పుడే ఈ పని ముగించటం మంచిది" అన్నాడు మంత్రి.




గత్యంతరంలేక ప్రేమవతి మంత్రివెంట వెళ్ళింది.

అక్కడ పొదరింట్లో ప్రేమవతికోసం కళాధరుడు నిరీక్షిస్తున్నాడు. ఆమె ఎందుకు ఆలస్యంచేసిందో ఊహించలేకపోయినాడు. ఆఖరుకు మంజీరాల ధ్వని వినిపించింది. మరుక్షణం మేలిముసుగుతో ఒక స్త్రీ పొదరిల్లు ప్రవేశించింది.

"ఇంత ఆలస్యమయిందేం, ప్రేమా? నీకోసం వేచియుండే ప్రతిక్షణమూ నాకొక యుగమని తెలియదా?" అన్నాడు కళాధరుడు.

ఆ స్త్రీ మేలిముసుగు తొలిగించింది. ఆమె ప్రేమవతికాదు, చపల. మరుక్షణమే రాజుగారు భటులతోసహా లోపలికివచ్చారు. ప్రేమవతి బాహుబంధంకోసం ఎదురు చూస్తున్న కళాధరుడికి కారాగారబంధం ప్రాప్తమయింది.

కళాధరుడి తప్పిదానికి మరణశిక్షతప్ప మరొకటిలేదు. అయితే ఈ సందర్భంలో రాజకుమార్తె తప్పుకూడా కొంత ఉంది గనక అతనికి మరణశిక్షే అవుతుందో, వివాహమే అవుతుందో నిర్ణయించేబాధ్యత దైవంమీద వేశారు.

దర్బారులో సింహాసనానికెదురుగా రెండు గదులు నిర్మించారు. ఒకదానిలో పులినీ, రెండవదానిలో ఒక కన్యనూ ఉంచారు. నిందితుడు ఏదో ఒక తలుపు తెరవాలి. తెరిచిన ద్వారంలోనుంచి పులి వచ్చిందా అతనికి మరణం తప్పదు. అందులోనుంచి కన్య వచ్చిందా అతనికి ఆ కన్యతో పరిణయం తప్పదు.

దర్బారు సభానికి అలవ కట్టారు. రాజకుటుంబమూ, ఇతర పెద్దలూ అలవకిపతల కూర్చున్నారు. రాజకుమార్తె తండ్రిపక్కనే కూర్చుంది.

నిందితుడికి జరగబోయే పరీక్ష ఎట్లా పరిణమిస్తుందో చూడాలని అందరూ కుతూహలపడుతున్నారు. ఏ తలుపువెనక పులి ఉన్నదో, దేనివెనక స్త్రీ ఉన్నదో, ఆ స్త్రీ




ఎవరో ఎవరికీ తెలియదు—మంత్రికీ, రాజకుమార్తెకూ తప్ప.

అలవలోకి నిందితుడైన కళాధరుడు తీసుకురాబడ్డాడు. అందరి కళ్ళూ అతని మీదనే ఉన్నవి. చావుబతుకులమధ్య ఉన్న కళాధరుడు రెండువాకిళ్ళకేసీ ఒకక్షణం చూశాడు; తరువాత దీనంగా సభకేసి చూశాడు. అతని దృష్టి తన ప్రియురాలైన రాజకుమార్తెమీద నిలిచింది. అతని కళ్ళు ఆమెను వేడుకొన్నవి—తనను ఎట్లాగైనా ఈ ఆపదనుంచి రక్షించమని. రాజకుమార్తె చిన్న కనుసైగతో అతని ప్రాణాలు రక్షించగలదు. ఆ సైగకోసం కళాధరుడు ఆమె వంక ఆత్రంగా చూస్తున్నాడు.

రాజకుమార్తె మనసులో పెద్ద సంక్షోభం చెలరేగుతున్నది. తాను ఈ యువకుణ్ణి మోహించింది. ఇప్పటికీ ఆమెహృదయం అతడికోసరం కొట్టుకొంటూనే ఉన్నది. నిజంగానే అతను నవమన్మథుడు. అటువంటివాడు పులివాతపడటం చాలా అన్యాయం. సభలో ఉన్నవారిలో ఒక్కరు కూడా అతను చావాలని కోరటంలేదు. అతను తెరవబోయే తలుపులోనుంచి కన్య రావాలనే కోరుతున్నారు. అటువంటప్పుడు ప్రేమవతి, ఒకప్పుడతన్ని ప్రేమించిన మనిషి, ఇప్పటికీ ప్రేమిస్తున్న మనిషి, అతను పులివాత పడాలని కోరకపోవటం సహజం.

కాని మరొకటికూడా వున్నది. ఈ కళాధరుడు బతికినా చచ్చినా తనవాడుమాత్రం కాబోడు.

తనకూ అతనికి చపలధర్మాన ఏనాడో రుణంతీరిపోయింది. చపల తన ప్రణయాన్ని, తన యజమానురాలి ప్రణయాన్ని సాహసంతో భగ్నంచెయ్యటమేగాక ఆ తలుపువెనక నిలబడటానికికూడా సమ్మతించింది.

తాను కనుసైగచేసి ఆ తలుపు చూపినట్టయితే, కళాధరుడు చపల భర్త అయిపోతాడు. చపల తనమీద రెండు విజయాలు సాధించినదవుతుంది. ఒక విజయానికి తాను పగతీర్చుకొకపూర్వమే చపలకు తనకుతానై ఇంకొక విజయం సాధించి పెట్టటమా? అభిమానవతి అయిన తాను ఆపని చేయగలదా?

ఈ భావాల సంఘర్షణనుండి చిట్టచివరకు ప్రేమవతి బయటపడింది. మంత్రిగారు నిందితుణ్ణి ఏదోఒక తలుపు తెరవమని ఆజ్ఞాపించాడు. నిందితుడు ఇంకా రాజకుమారెవంకే చూస్తున్నాడు. అంత సభలోనూ అతనికి ఆమెతప్ప మరేమీ కనిపించటంలేదు. ప్రేమవతి తన ప్రియుడు వాంఛిస్తున్నవిధంగా కనుసైగచేసింది. కళాధరుడి ముఖాన చిన్నచిరునవ్వు తోచింది. అతను నిర్భయంగా వెళ్ళి రాజకుమారై సూచించిన వాకిలితలుపుల గడియతీసి తలుపులు గభాలున తోసేశాడు.

వాకిలిగుండా పులి వచ్చిందా? చపల వచ్చిందా? తనను ప్రేమించటం తప్ప ఇంకేనేరమూ చేయని కళాధరుడికి ప్రేమవతి శిక్ష ఇచ్చిందా? బహుమానం ఇచ్చిందా? మీరే జాగ్రత్తగా ఊహించండి.






# నోటిలెక్క

కన్యాకుబ్జనగరపు రాజుగారు ఒక చాటింపు వేయించారు. 'రాజుగారి నోటిలెక్కకు సమాధానం చెప్పగలోడికి మంత్రిపదవి ఇస్తారంటో హోయ్' అని. ఆ నగరంలో మంత్రిపదవి ఖాళీ అయింది. మంచి తెలివైనవాణ్ణి ఎవరినైనా చూసి మంత్రిగా చెయ్యాలని నిశ్చయించుకుని రాజుగారు అలాగ టముకు వేయించారు.

బళ్ళో నోటిలెక్కలలో ఫస్టుమార్కులు తెచ్చుకునే పిల్లలంతాకూడా టముకు విన్న తక్షణమే 'మేం చెప్తా'మంటే 'మేం చెప్తామ'ని బుజాలెగరేసుకు బయల్దేరేరు.

రాజుగారిచ్చేది నోటిలెక్కే ఐనా బడి పిల్లలకర్థమయేటంత సులభంగా ఉండదనీ, ఎఫ్. యేలూ, బి. య్యేలూ ప్యాసైనవాళ్ళకి గాని అర్థంకాదనీ ఆలోచించి, పిల్లలకు లెక్కలుచెప్పే మేష్టర్లుకూడా వెళ్ళేరు. 'రాజుగారు పూర్వకాలపు శాస్త్రాలంటే గౌరవం ఉన్నవాడు. ఆయన ఇచ్చే నోటిలెక్క రూపాయి అణాల పైసల్లోనూ మణుగూ వీశెలూ తులాల్లోనూ ఉండేది గాక, ఏ పంచాంగపు లెక్కో ఐవుంటుంది' అని ఆలోచించి పంచాంగాలు రాసే సిద్ధాంతులుకూడా వెళ్ళేరు. వడ్డీకి సంబంధించిన లెక్క ఐవుంటుందనుకుని షావుకార్లు వెళ్ళేరు.

వాళ్ళనందరినీ, ఒక పెద్ద ప్రాకారంవున్న దొడ్డిలోకి వెళ్ళి నిలబడమని, తలో కాగితం, పెన్సిలూ ఇచ్చారు రాజుగారు.

దొడ్డిలో కొందరు ఎక్కాలూ, మానాలూ, నెమరుకు తెచ్చుకుంటున్నారు. కొందరు సరస్వతీదేవిని ప్రార్థించుకుంటున్నారు. మరి కొందరు బృహస్పతి, శుక్రుడు, యుగంధరుడు, చాణుక్యుడు, తిమ్మరుసు మొదలైన గొప్పగొప్ప మంత్రుల నందరినీ తలుచుకున్నారు.

రాజుగారి భేరీ మ్రోగేసరికి అంతా నిశ్శబ్దమైంది. 'నోటిలెక్క వినండి: పన్నెండులో నాలుగు పోతే మిగిలేది ఎంత? ఈ ప్రశ్నకు సమాధానాన్ని మీకిచ్చిన చీటీలమీద రాసి గుమ్మంవద్ద నాకు చూపండి. ఎవరి

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మదరాసు





సమాధానం సరిగ్గావుంటే ఆయనకు మంత్రిపదవి ఇచ్చే స్తాను ' అన్నారు.

'ఒశ్ ఇంతేనా?' అనుకుంటూ అందరూ తమతమ కాకితాలమీద పెన్సిళ్లతో జవాబు రాసేశారు. జనమంతా తమతమ చీటీలను రాజుగారికి చూపించారు. ఆ చీటీ లన్నింటిలోనూ ఒకటే మోస్తరు సమాధానం ఉంది. 'పన్నెండులో నాలుగు పోతే మిగిలేది ఎనిమిది' అని. బడిపిల్లలు రాసినా, పంతుళ్లు రాసినా, సిద్ధాంతులు రాసినా, షావుకార్లు రాసినా అదే.

రాజుగారు ఓపిగ్గా ఒక్కొక్క చీటియేచూసి, 'తప్పు' అని నలిపిపారేసి, 'పొండి' అనేశారు. చివరకు భూషయ్య అనే కుర్రవాడు ఒక్కడే మిగిలాడు. అతడు తన చీటీని రాజుగారికి అందించాడు. 'ఇందులో ఏమీ రాయలేదేం' అన్నారు రాజుగారు. 'నాకు రాయటం తెలవదు ప్రభూ! నేను వ్యవసాయం చేసుకునే రైతుని. చదువుకోలేదండి' అన్నాడు భూషయ్య.

'అయితే లెక్కకి సమాధానం నోటిని చెప్పు' అన్నారు రాజుగారు. భూషయ్య అందుకు 'పన్నెండులో నాలుగు పోతే మిగిలేది సున్నఅండి' అన్నాడు. రాజుగారు





'భూషయ్యని మంత్రిగా నియమించాం!' అన్నారు. తక్కినవాళ్లందరికి వొళ్లు మండిపోయింది. 'పల్లెటూరు రైతుకు మంత్రిపదవి యేమిటి? వాడు చెప్పిన జవాబు తప్పు!' అన్నారు వాళ్లు. 'శ్రీ శ్రీ శ్రీ భూషయ్యగారిని వాడూ, వీడూ అనటానికి వీల్లేదింక. మంత్రిని చేశాం' అన్నారు రాజుగారు. ప్రజలు భూషయ్యనే అడిగేరు. 'ఏమండీ, పన్నెండింటిలో నాలుగుపోతే మిగిలేది సున్నాఎట్లా?' అని.

శ్రీ శ్రీ శ్రీ భూషయ్యగారు చెప్పినదేమిటంటే "రాజుగారి ఉద్దేశం పన్నెండింటిలో నాలుగు తీసివేస్తే ఎంతో చెప్పుకోమని కాదు. అదేఐతే గుడ్డిగంగమ్మకూడా చెప్పగలదు. ఆయన ప్రశ్నలో విశేషం ఏదోఉందని ఆలోచిస్తే నాకు వారుచెప్పిన పన్నెండు 'సంవత్సరంలోని పన్నెండు మాసాలు' అని తోచింది. ఈ పన్నెండులో ముఖ్యమైనవి, 'వర్షాలుకురిసే నాలుగు మాసాలూ'ను. వర్షాలులేకపోతే పంటలు సున్నా. అందుచేత పన్నెండులో నాలుగు పోతే మిగిలేది సున్నా అని చెప్పేను" అన్నాడు. భూషయ్య తెలివికి మెచ్చుకొంటూ అందరూ తమతమ ఇళ్లకు పోయారు.

# వీరబల్  వినోదాలు

పూర్వం అక్బర్ సంస్థానంలో వీరబల్ అనే హాస్యగాడు ఉండేవాడు. వీరబల్ తెలివి తేటలనూ హాస్యధోరణినీ అక్బర్ ఎంతో మెచ్చుకుంటూ ఉండేవాడు.

మిగతావాళ్లకు ఇది కన్నెర్రగా వుండేది కాని, వీరబల్ జోలికి వెళ్లటం అంత క్షేమకరం కాదని వూరుకునేవాళ్ళు. ఒకనాడు ఏదో సందర్భంలో పాదుషా తాలూకు మంగలివాణ్ణి వీరబల్ పరాభవించాడు. అనాటినుంచీ మంగలివాడు ఎలాగైనా వీరబల్ మీద పగ తీర్చుకునేందుకు అనేక ఆలోచనల్ని చేస్తూండేవాడు.

ఒకనాడు అక్బర్ పాదుషాకు క్షవరం చేస్తూ మంగలివాడు ఇలా అన్నాడు :

"ప్రభూ! చచ్చి స్వర్గంలో వున్న తమ తాత ముత్తాతల యోగక్షేమాలు తెలుసుకోవాలని తమకు కుతూహలంగా లేదా ?"

"ఎట్లా ?" అన్నాడు అక్బర్.

"ఏముందీ...మనం ఒక మనిషిని పంపిస్తే చూసివొస్తాడు" అన్నాడు మంగలి.

"మృత్యువును మోసంచేసి తిరిగిరాగల మొనగాడెవరు ?" అన్నాడు అక్బర్.

"ఆ తెలివితేటలు మన వీరబల్ కే వున్నవి" అన్నాడు మంగలి.

"స్వర్గానికి వెళ్ళటం ఎలా ?" అన్నాడు పాదుషా.

"ఏముందీ—మనిషిని తగలబెడితే, పొగరూపంలో ఆకాశంలోకి వెళ్ళిపోతాడు; అక్కణ్ణుంచి స్వర్గానికి వెళ్లటం...అంతే!" అన్నాడు మంగలి.

ఈపద్ధతి అక్బర్‌కు బాగా నచ్చింది: వెంటనే వీరబల్‌ను పిలిపించి "ఎదురు చెప్పకుండా నాకోర్కెను తీర్చాలి" అన్నాడు పాదుషా.

"చెప్పండి ప్రభూ! మీకోర్కెను తప్పక తీరుస్తాను" అన్నాడు వీరబల్.

జి. హనుమాయమ్మ - హైదరాబాదు



"ఏంలేదు...స్వర్గానికి వెళ్లి మాతాతలూ తండ్రులూ ఎలావున్నారో చూసిరావాలి" అన్నాడు అక్బర్. ఆ తరువాత ఎలా వెళ్ళాల్సిందీ వివరించాడు.

"చచ్చి మళ్ళీ బతికిరావటం సాధ్యమా ప్రభూ?" అన్నాడు వీరబల్.

"ఇక్కడే నీ తెలివితేటలు కనిపించాలి. మృత్యువును మోసంచేయగల శక్తి నీ ఒక్కడికే వుంది. ప్రయత్నంచేస్తే తప్పకుండా నెగ్గగలవు" అన్నాడు పాదుషా.

తనకివి తప్పేటట్లు లేవని తేలిపోయింది. పాదుషా మాటను ధిక్కరిస్తే తల తీయిస్తాడు. కనుక యేదో తెలివిగా తప్పించుకునేందుకు వేరుగా ప్రయత్నాలు చేయాలి.

"మీరు ధైర్యం చెప్పారు కనుక తప్పకుండా వెళ్ళివొస్తాను. కాని ఒక్క మనవి: నా తల్లికి నేనొక్కణ్ణే కొడుకును. మా అమ్మ తన విచారాన్ని మరిచిపొయ్యేందుకుగాను పదిమణుగుల బంగారాన్ని వెంటనే ఆమెకు పంపండి. నాకో నెలరోజుల వ్యవధి ఇస్తే, ఎలా తెలివిగా మృత్యువును మోసంచేయాలో ఆలోచించుకుంటాను. నన్ను దహనం చేయవలసిన స్థలాన్ని





కూడా నిర్ణయించుకుంటాను" అన్నాడు వీరబల్.

పాదుషా వీరబల్ చెప్పినదానికి అంగీకరించి వెంటనే పదిమణుగుల బంగారాన్ని అతని తల్లికి పంపించాడు. తన ప్రాణానికి ఎక్కుపెట్టింది మంగలి అని తెలిసి, వీరబల్ ఎలాగైనా మంగలిని మట్టుపెట్టాలని ఆలోచనలుచేశాడు.

పదిమంది నమ్మకమైన కూలివాళ్ళను తీసుకొని అడివిలోకి వెళ్ళి, ఒకపెద్ద గొయ్యి తీయించాడు. గోతిలోనుంచి నాలుగు మైళ్ళ పొడుగున సొరంగం తవ్వించి, అక్కడ మళ్ళీ పైకి వొచ్చేందుకు, పెద్ద




గొయ్యి తీయించాడు. మొట్టమొదట తీయించిన గొయ్యిమీద సన్నని తడిక వేయించి, దానిమీద మట్టి చల్లి చిన్నచిన్న మొక్కల్ని నాటించాడు. చూసేవాళ్ళకు అడుగున తడిక వున్నదనిపించకుండా, అదికూడా భూమిగానే కనిపించేట్టు చేశాడు.

చివరకు వీరబల్ స్వర్గం జేరే రోజు రానే వొచ్చింది. ఈ విచిత్రాన్ని చూసేందుకు ఎంతోమంది జనం వొచ్చి విరగబడ్డారు. వీరబల్ పట్ల పాదుషా చూపే అభిమానానికి కన్నెరగావున్న వాళ్ళందరూ కలకలలాడుతూ, యెంతో సంతోషంగా వున్నారు.

అప్పుడు వీరబల్ "మహారాజా ! నాదొక



మనవి. నేను తెలివిగా మృత్యువునే మోసం చేయవలసిన సమయంకదా ! అందుకని నన్ను యెవరికంటా పడకుండా దహనం చేయాలి —" అని మనవి చేశాడు.

"అంటే ఏంచేయమంటావ్ ?" అన్నాడు పాదుషా.

"నాచుట్టూ కట్టెలు పేర్చి, ఇల్లల్లే కట్టండి. ఆ తరువాత ఆ ఇంటికి నిప్పు అంటించండి. పొగరూపంలో నేను స్వర్గంలో జొరబడతాను" అన్నాడు వీరబల్.

పాదుషా అందుకు సమ్మతించాడు. పొడుగాటి కట్టెలు తెచ్చి వీరబల్ చుట్టూ ఇల్లల్లే పేర్చారు. అంతా పూర్తయేప్పటికి వీరబల్ బైటనుంచి చూస్తున్న జనానికి కనిపించటంలేదు. వెంటనే వీరబల్ అంతకు పూర్వమే తవ్వివుంచిన గోతిలోకి దూకి సొరంగంలోనుంచి అవతలి గోతికి జేరి, మెల్లిగా బైటపడ్డాడు.

కట్టెల ఇంటికి నిప్పుపెట్టారు. మంటలు లేచేసరికి నిజంగానే వీరబల్ చనిపొయ్యాడని అతని అభిమానులంతా ఏడిచారు.

* * *

రోజులు గడుస్తూన్నవి; నెలలు గడుస్తూన్నవి. కాని వీరబల్ తిరిగి రాలేదు.



బహుశా మృత్యువును మోసగించలేక వీరబల్ తిరిగి రాలేకపొయ్యాడని అందరూ అనుకున్నారు.

సంవత్సరం గడిచింది. ఒకనాడు పెద్ద గడ్డంతో, తలనుంచి వేలాడే బారెడు జుట్టుతో, జానడేసి గోళ్ళతో ఒకవ్యక్తి రాజ సభలో ప్రవేశించాడు. ఎవడో అడివిమనిషి రాజసభకు వొచ్చాడనుకొని అక్బర్ "ఎవరు నీవు?" అన్నాడు.

"మహారాజా! నన్ను అప్పుడే మరిచి పొయ్యారా? నేను వీరబల్‌ను...ఇప్పుడే స్వర్గంనుంచి తిరిగి వొస్తున్నాను" అన్నాడు ఆ అడివిమనిషి.

మొదట ఇది అబద్ధమనుకొని సభలోని వారంతా నవ్వారు. కాని నిదర్శనాలతో వీరబల్ చెప్పటం ప్రారంభించేసరికి వారం దరూ నమ్మక తప్పలేదు.

"ఏమిటి విశేషాలు?" అన్నాడు ఆత్రంతో పాదుషా.

"స్వర్గంలో ఎంత హాయిగా వుంది. నాకు అక్కణ్ణుంచి రా బుద్ధి పుట్టకనే ఇన్నాళ్లు వున్నాను. కాని ఒక్కటే చాలా ఇబ్బందిగా వుంది. అక్కడ మంగలి లేడు. సంవత్సర కాలంలో నా జుట్టూ, గోళ్లూ ఎలాపెరిగినవో చూడండి. సంవత్సరాల తరబడిగా అక్కడే వున్న మీతాతలూ తండ్రుల అవస్థ వర్ణిం చేందుకు వీలులేనంతగా వుంది...వెంటనే మన మంగలిని పంపమని వారు తమతో చెప్పమన్నారు—" అన్నాడు వీరబల్.

ఈమాట వినగానే మంగలికి గుండెల్లో ఎలుకలు పరుగెత్తినై, తనమీద దెబ్బ తీశాడురా వీరబల్ అని అనుకొన్నాడు. ఏ మనుకొంటేమాత్రం ఏం ప్రయోజనం?

మంగలి స్వర్గానికి వెళ్ళక తప్పలేదు. మామూలుపద్ధతిలోనే దహనం జరగనూ జరిగింది—మంగలి చావనూ చచ్చాడు.

అదిమొదలు వీరబల్‌జోలికి పోవట మంటే అందరికీ భయంగానే వుండేది.



# మేలుచేసిన దొంగ



రచన : డి. ధనరాజు

ఒక వెన్నెలరాత్రి ఒక దొంగ దొంగతనానికి బయలుదేరాడు. కాని దురదృష్టవశాత్తూ గొప్ప ఇళ్ళల్లోకి ప్రవేశించటం అతనికి కష్టమైంది. చివరకు ఒక పూరిగుడిసెలో జొరబడ్డాడు. అది బీదవారి ఇల్లని అతనికి తెలుసు. ఐనప్పటికీ, తిరిగి తిరిగి విసుగెత్తి వొట్టి చేతులతో ఇంటికి పోవటం ఇష్టంలేక పూరింట్లోకి ప్రవేశించాడు.

లోపల దీపమన్నా లెదు. ఇంటికప్పులోని పాత తాటాకులు నాలుగైదు గాలికి కొట్టుకొనిపోవటంవల్ల వెన్నెల లోపలకు పడుతోంది. ఆ ఇంటిలో ఆ వెలుగు మాత్రమే వుంది. చలికాలమేమో ఆ ఇంట్లో నివసించే ముసలి దంపతులు ముడుచుకుని పడుకున్నారు. ముసలిదానికి మెలకువ వొచ్చి, దొంగను చూసింది కాని, తన ఇంట్లో దొంగ యెత్తుకొని పోగలిగినవి ఏమీ లేనందువల్ల ఆమె మంచంమీదినుంచి లేవటం అనవసరమని నిశ్చయించుకుంది. తగినన్ని గుడ్డలు లేనందువల్ల, లేస్తే చలివేస్తుందని అలాగే చూస్తూ పడుకుంది.

దొంగ అగ్గిపుల్లలు గీసుకుంటూ కొంపంతా గాలించాడు; కాని అతనికేమీ దొరకలేదు. చివరకు వంటింట్లో పెలపిండి కుండ వుంది. ఆ పేలపిండన్నా తీసుకొని వెళ్దా



మనుకొని, పేలపిండి మూట కట్టుకునేందుకని పైపంచె పరిచాడు. వేరొక తావులో పంచె పరుస్తే పేలపిండి పోసేందుకు వెలుగు ఉండదని, సరిగ్గా వెన్నెల పడుతూన్న స్థలంలోనే పంచెను పరిచాడు.

తెల్లని వెన్నెట్లో తెల్లని పైపంచెను దొంగ పరిచాడు. ఆ రెండురంగులూ ఏకవర్ణంగానే కనిపించసాగినై ఏది గుడ్డ, ఏది వెన్నెల అని తెలియటంలేదు.

ఇక పేలపిండి తెచ్చేందుకని దొంగ వంటింట్లోకి వెళ్ళాడు. ఈ సమయంలోనే ముసలిది లేచివెళ్ళి, వెన్నెట్లో పరిచిన పైపంచెను తీసి కప్పుకొని వెచ్చగా పడుకుంది.






దొంగ పేలపిండి తెచ్చి, వెన్నెలను తన పైపంచెగా భావించి, నేలమిదనే కుండను రాల్చి, మూటకట్టేందుకని పంచె చెంగుల్ని లాగసాగాడు. వెన్నెల అంచులే తన పైపంచె అంచు లనుకొని ఎంత లాగినా చేతికి అందకపోవటంతో దొంగకు కాస్త అనుమానం తగిలింది.

ఇంతలో ముసలిది యిలా అంది: "దొంగన్నా! నీ దయవల్ల నాకు కప్పుకొనేందుకు గుడ్డ దొరికింది. మి బావకుకూడా ఇంకొక్క గుడ్డ యిచ్చావంటే నీ మేలును మరవను."

ఇంట్లోవాళ్ళు మేలుకొనే వున్నారని గ్రహించి దొంగ కాళ్ళకు బుద్ధిచెప్పాడు.

# అట్టచివరి బొమ్మ

అనగనగనగా ఒకదేశం. ఆ దేశానికి ఒకరాజు. ఆ రాజుకు ముగ్గురు కొడుకులు. ముగ్గురూ అందమైనవాళ్లూ, తెలివిమంతులున్నూ.

రాజుకు వృద్ధాప్యం రావటంచేత, తన తదనంతరం రాజ్యం ఎవళ్లకు చెందజేయటమా అని ఆలోచనలో పడ్డాడు.

పెద్దవాడైన కాంతిసేనుడు తెలివిమంతుడే కాని, కొంచెం తలబిరుసు. రెండవవాడు కమలసేనుడూ ఇంచుమించు అంతే. ఇద్దరూ గర్వులు కావటంచేత ప్రజలకు వాళ్లంటే అంతగా ఇష్టంవుండేదికాదు. కడసారివాడైన కృపాసేనుడు నలుగురిలో అనుకూలంగా మసిలేవాడు కనుక, అతను జనముద్దుగా ఉంటూ వచ్చాడు. అందుచేతనే 'ఏనాటికైనా మనకు కృపాసేనుడే ప్రభువు కావాలి' అని ప్రజ కోరుకొనేవారు.

రాజు తన వృద్ధేశాన్నిగురించి మంత్రులను సలహా చేశాడు. వారు ఏమీ సమాధానం చెప్పలేకపోయారు. చివరకు, తనంతట తనకే ఒక చక్కటి ఆలోచన తట్టింది. ముగ్గురు కొడుకులనూ చేరబిలిచాడు:

"చూచారా, నాకు వృద్ధాప్యం వచ్చేస్తున్నది. నాతరువాత మీ ముగ్గురిలో ఎవరో ఒకరు రాజు కావాలికద. ఐతే, మీ ముగ్గురూ నాకు సమానులే. ఒకరు ఎక్కువ లేదు, మరొకరు తక్కువ లేదు. అందుచేత ఒక వుపాయంచేశాను. అది ఏమిటీ అంటే—ఒక సంవత్సరం గడువిస్తాను. ముగ్గురూ మూడుదారులా వెళ్లండి. ప్రపంచంలో ఎక్కడైనాసరే, చూస్తే నవ్వొచ్చే చిన్నికుక్కబొమ్మను సంపాదించి తీసుకురండి. ఎవరైతే ప్రపంచంలోకల్లా చిన్నికుక్కను పట్టుకు రాగలరో వాళ్లకే నారాజ్యం" అని చెప్పాడు.

ఇందుకు రాజపుత్రులు ముగ్గురూ ఉత్సాహంతో సమ్మతించారు. పెద్దవాడు నల్లగుర్రాన్ని, రెండవవాడు ఊదాగుర్రాన్ని, కడసారివాడు తెల్లగుర్రాన్నీ తీసుకు బయలుదేరారు.

ముగ్గురూ పట్టణపు పొలిమేర వుండే పెద్దరావిచెట్టువరకూ కలిసి వెళ్లారు. గడువు తీరగానే ఒకళ్ల సంగతి ఒకళ్లు తెలుసుకునేటందుకుగాను, మళ్లీ ఈచెట్టు కిందనే కలుసుకోవటానికి నిశ్చయించుకుని, అక్కడినించి ముగ్గురూ మూడు దారులా దౌడుతీసుకొంటూ బయలుదేరారు.



# భానుదాసు

గోదావరీతీరాన పైఠణమనే గ్రామంలో సూర్యోపాసకుడైన బ్రాహ్మణుడొకడు ఉండేవాడు. అతనికి చాలారోజులవరకు సంతానం కలుగలేదు. చివరకు ఎలాగైతేనేం సూర్య దేవుని కృపవల్ల ఒక కుమారుడు కలిగాడు. ఆ బ్రాహ్మణుడు బాలునికి భానుదాసని పేరుబెట్టి అల్లారుముద్దుగా పెంచుతున్నాడు.

భానుదాసుకు ఐదేళ్లు నిండాయి. ఒక గురువువద్ద విద్యాభ్యాసానికి పంపాడు తండ్రి. కాని పిల్లవానికి చదువుమీద శ్రద్ధ కుదరలేదు. పాఠాలు వింటున్నప్పుడు కూడా అతని మనస్సు ఎక్కడో ఉండేది. అయ్యవారు తండ్రితో ఫిర్యాదు చేశాడు 'మీ అబ్బాయికి చదువు అబ్బేట్టు లే'దని. తండ్రికి చాలా కోపంవచ్చింది. భానుదాసుని ఒక చెట్టుకి కట్టివేసి వీపు చిట్లేట్టు కొట్టాడు.

సున్నితమైన మనస్సుకావటంవల్ల పిల్లవాడు చాలా కుమిలిపోయాడు. తండ్రి తనను మళ్ళా కొడతాడేమోనని భయపడి, ఆ రాత్రికిరాత్రే ఇంట్లోంచి పారిపోయాడు.

ఆ వూరికి కొద్దిదూరంలో ఒక అరణ్యం వున్నది. భానుదాసు నడచినడచి ఆ అరణ్యంచేరుకొని లోనికి చొచ్చుకువెళ్లాడు. అరణ్యంమధ్య నిర్మానుష్య ప్రదేశంలో ఒక పాడుబడిన గుడి కనుపించింది. అది ఎప్పటిదో పాండురంగని మందిరం. భానుదాసు మండపంలో కూచుని ఎలాగో అలా గడగడ వణుకుతూ రాత్రి వెళ్ళబుచ్చాడు.

తెల్లవారింది. పగటి వెలుగులో ఆ కీకారణ్యం మరింత భయంకరంగా కనుపించసాగింది. ఇంతలో మందిరగర్భంలో వున్న పాండురంగని విగ్రహం భానుదాసు కంట

అర్. ఎల్. దీక్షితులు - కడప




బడింది. ఒక్కసారిగా బాలునికి జ్ఞానోదయం కలిగినట్లయింది. పూర్వజన్మ సంస్కారం వెల్లువలా పొంగివచ్చింది. గురువు పాఠం చెబుతున్నప్పుడు శ్రద్ధగా వినలేని ఆ బాలుడు ఉచ్చస్వరంతో పాండురంగని స్తుతించసాగాడు.

ఈవిధంగా మధ్యాహ్నమయ్యేటప్పటికి భానుదాసు ఆకలిదప్పులతో సొమ్మసిల్లాడు. ఐనా అతడు తన దీక్ష విడువలేదు.

ఇంతలో యెవరో 'భానుదాసూ!' అని పిలుస్తున్నట్టు వినిపించింది. బయటకు వచ్చి చూచేటప్పటికి ఒక గొల్లవాడు పాలచెంబు చేతపట్టుకొని నిలబడి వున్నాడు.

'నాయనా! నిన్ను చూస్తే శోషకొచ్చినట్టు కనిపిస్తున్నది. ఈ చెంబులో పాలు ఉన్నవి. కొంచెం పుచ్చుకుంటావా?' అని ఆ గొల్లవాడు యెంతో ఆప్యాయతగా భానుదాసుని అడిగాడు.

భానుదాసు మొదట కొంచెం సందేహించాడు. కాని ఆకలికి తాళలేక ఆ చెంబు పుచ్చుకొని పాలు గుటగుటా త్రాగివేశాడు. గొల్లవాడు తన త్రోవను వెళ్ళిపోయాడు.

అప్పటినుంచి ఆ గొల్లవాడు రోజూ మధ్యాహ్నమయ్యేసరికి వచ్చి భానుదాసుకి చెంబుతో పాలు తీసుకవచ్చి, ఇచ్చి పోతుండేవాడు. భానుదాసు భగవద్ధ్యానం చేసుకొంటూ, మైమరచి మధురస్వరంతో పాటలు పాడుతూ, దినాలు క్షణాలుగా గడుపసాగాడు. ఆ గొల్లవాడెవరో, ఈవిధంగా రోజూ పాలు తీసుకొచ్చి తనకెందుకు ఇచ్చి పోతున్నాడో, అతడు ఆలోచించలేదు. భగవదుపాసనలో నిమగ్నుడైవున్న అతనికి ఇది ఆలోచించే వ్యవధి కూడా లేకపోయింది.

ఆ గొల్లవాడు సాక్షాత్ పాండురంగడే నన్న సంగతి అతనికి తెలియదు.

ఈవిధంగా సంవత్సరాలు దొరలి పోయాయి. భానుదాసు ఆ అడివిలోనే గొల్లవాని రూపంలో పాండురంగడు తెస్తున్న పాలతోనే పెరిగి పెద్దవాడయ్యాడు.

ఇలావుండగా ఒకరోజున పైఠణ గ్రామానికి చెందిన కట్టెలవాడొకడు కట్టెలకోసం భానుదాసు ఉంటున్న అడవిలోకే వచ్చాడు. ఆ పాడుబడిన గుడికి దగ్గరలోనే కట్టెలు కొడుతూండగా అతనికి అమృతతుల్యమైన కంఠంతో భక్తిపరవశమైన మధురగానం వినిపించింది. 'ఆ పాడుతున్న దెవరా' అని ఆలోచిస్తూ అతడు గుడిపద్దకు వెళ్ళి తొంగి చూశాడు. అతనికి తేజోమయుడైన భానుదాసు ధ్యానమగ్నుడుగా కనుపించాడు.

ఆ కట్టెలవానికి తమ గ్రామంలోనివాడే బ్రాహ్మణపుత్రుడొకడు పారిపోయిన సంగతి తెలుసు. అందువల్ల వెంటనే అనుమానం కలిగి, తిరిగివెళ్ళి, భానుదాసు తల్లిదండ్రులకు ఈ వార్త తెలిపాడు. వెంటనే వారంతా కాళ్ళకు రెక్కలు కట్టుకవచ్చినట్టుగా ఇక్కడ వాలారు. భానుదాసును చూచి, 'నాయనా! ఇన్నాళ్ళూ ఎక్కడున్నావురా?'



అని కౌగిలించుకొన్నారు. తరువాత ఇంటికి తిరిగిరమ్మని బలవంతం చేయసాగారు.

కాని భానుదాసు 'తండ్రీ! నేనీ మందిరం విడిచిపెట్టి రాలేను' అన్నాడు.

"అలాగైతే మేము అన్నాహారాలు మాని ఇక్కడే ప్రాణాలు విడిచేస్తాం. నిన్నువదిలి బ్రతుకలేము" అన్నారు తల్లిదండ్రులు.

అప్పుడు భానుదాసు ధ్యానమగ్నుడై పాండురంగని తలచుకొన్నాడు. రంగ






ఈ విధంగా భానుదాసు ఇంటికి తిరిగి వచ్చి సుఖంగా కాలయాపన చేయసాగాడు. యుక్తవయస్సు రాగానే తల్లితండ్రులు అతనికి వివాహంచేశారు.

మరి కొంత కాలానికి అతని తల్లిదండ్రులు గతించారు. సంసారభారమంతా భానుదాసు ఒక్కడే మోయవలసి వచ్చింది.

ఎప్పుడూ దైవచింతనలోనే మునిగిఉండి లౌకికవ్యవహారాలలో జోక్యం కలిగించుకొనకపోవడంవల్ల భానుదాసుకి దారిద్ర్యం తప్పలేదు. పొట్టగడవటంకూడా చాలా కష్టమైపోయింది.

అప్పుడు గ్రామస్థులు కొంతమంది కూడి అతనివద్దకు వచ్చి 'భానుదాసూ! చతుర్విధ పురుషార్థాలలో అర్థంకూడా ఒకటిగదా? భుక్తి లేనిదే భక్తి సాధ్యమా? గృహస్థుడైనవాడు తన కుటుంబసంగతికూడా ముఖ్యంగా చూచుకొనవలసి ఉంటుంది కదా. అందువల్ల నీవేదైనా వ్యాపారం చేయరాదా?' అని సలహా ఇచ్చారు.

అందుకు భానుదాసు 'నాయనలారా! వ్యాపారం చేయటానికి నావద్ద పెట్టుబడి లేదే?' అన్నాడు.

దేవుడు అతడికి ధ్యానంలో సాక్షాత్కరించి, 'భానుదాసూ: నీవు ఇంటికి తిరిగివెళ్లి, గృహస్థుడవై తల్లిదండ్రుల అభీష్టం నెరవేర్చు. రాజయోగులైన జనకాదులవలె నీవుకూడా ఐహికజీవితంలో మునిగి తేలుతూనే సిద్ధిని సాధించగల'వని ఆదేశించాడు. ఇక భానుదాసు ఇంటికి తిరిగివెళ్లడానికి అభ్యంతరపెట్టలేదు. తల్లితండ్రుల సంతోషానికి మితి లేకపోయింది.



అవిషయమై 'నీవు సంశయించ నక్కర లేదు. మేమంతా చందాలువేసుకొని నీకు పెట్టుబడి పెడతాము' అన్నారు వారు.

భానుదాసు చాలా బలవంతమీద దీనికి అంగీకరించాడు. అతడు సంశయించటానికి కారణం అసలు వేరేఉంది. 'వ్యాపారం చేసేవాడు అసత్యమాడటం, వంచన చేయడం తప్పదుగదా' అనేదే అతనికి పట్టిన సందేహం. 'ఏమైనాసరే, నేనుమాత్రం అసత్యమాడకుండా వ్యాపారంచేస్తాను' అని నిశ్చయించుకున్నాడు భానుదాసు.

ఈవిధంగా భానుదాసు ఇతరుల ప్రోద్బలంమీద ఇతరుల పెట్టుబడితో బట్టల కొట్టు పెట్టాడు. కాని తానుమాత్రం అనుకొన్నట్లే అసత్యమాడటంలేదు. కొనటానికి వచ్చినవారికి వస్తువు అసలువెల ఎంతో, తాను వేసుకొంటున్న లాభమెంతో, నిక్కచ్చిగా చెప్పివేస్తున్నాడు. దీనివల్ల కాతాదారు లందరికీ అతనిమీద చాలా నమ్మకం కుదిరింది. బట్టలు కావలసినవారంతా అతనివద్దకే రాసాగారు. వ్యాపారం బాగా వృద్ధిచెందింది. అప్పులన్నీ తీర్చేశాడు. పెట్టుబడి పెట్టినవారందరికీ ఎవరికివ్వవలసిన సొమ్ము వారికి తిరిగి ఇచ్చివేశాడు.




భానుదాసు ఇలాడబ్బు గడించడంచూచి వారందరూ అసూయచెందారు. ముఖ్యంగా లోగడ అతనికి పెట్టుబడి పెట్టినవారందరికీ చాలా కంటగింపుగా వున్నది. వారంతా ఇతని కేదోవిధంగా కీడుచేయాలని కూడ బలుక్కున్నారు. పాపం, అమాయకుడైన భానుదాసు కిదంతా తెలియదు.

ఒకసారి ఈకుట్రదారులు సరుకులకోసం భానుదాసుని తమవెంట రమ్మన్నారు.



భానుదాసు చాలా ద్రవ్యం తీసుకొని వారి వెంట పయనమయ్యాడు. అంతా గుర్రా లెక్కి వెళ్లుతున్నారు. ఆ రాత్రికి వారంతా ఒక సత్రంలో మకాం చేశారు. భోజనా లయాక, ఒకచోట హరికథ జరుగుతున్నదని విని భానుదాసు తనతోటివారినిగూడ రమ్మని పిలిచాడు. కాని వారు రామనేటప్పటికి అతడు ఒక్కడే వెళ్ళాడు. అదునుచూచి భానుదాసువెంట వచ్చినవారు అతని ద్రవ్యం కాజేసి గుర్రాన్ని పారద్రోలారు. పిమ్మట తమతమ గుర్రాలెక్కి గుట్టుచప్పుడు కాకుండా సాగిపోయారు.

భానుదాసు హరికథ విని తిరిగివస్తుంటే త్రోవలో గుర్రపుకళ్ళెం పట్టుకొనివున్న ఒక మనిషి కనిపించాడు. అది తనగుర్రమే.

'నాగుర్రం నీకెలా చిక్కింది? నీవెవరవు?' అని అడిగేలోగానే అవ్యక్తి తన డబ్బుసంచి కూడా తీసి ఇచ్చి, మాయమయ్యాడు.

ఈ చోద్యానికి అబ్బురపడుతూ భాను దాసు గుర్రమెక్కి సత్రంవద్దకు వెళ్ళాడు. అక్కడ తనవెంట వచ్చినవారెవరూ లేరు. వాళ్లకోసం వెతుకుతూ కొంతదూరం పోగా ఒక ఏటిఒడ్డున వారంతా ఏడుస్తూ మొత్తు కొంటూ కనుపించారు భానుదాసుని చూడగానే వారంతా ఏడుస్తూ కాళ్లమీదపడి 'క్షమించు భానుదాసూ! మేమేదో తెలియక నేరంచేశా'మన్నారు.

'అసలు జరిగిన విషయమేమిటి?' అన్నాడు భానుదాసు.

'మేము నీపట్ల అసూయచెంది, నీడబ్బు దొంగిలించి, గుర్రాన్ని విడిచిపుచ్చాము. కాని దోవలో దొంగలు పైనబడి మమ్మల్ని హింసించి దోచుకొన్నారు. భగవంతుడే మమ్మల్నీవిధంగా శిక్షించాడు" అన్నారు.

అప్పుడు భానుదాసు 'ఇది అంతా ఆ పాండురంగని మహిమ' అని గ్రహించాడు. 'నాయనలారా! నావేమున్నది! ఆ పాండు రంగని వేడుకోండి. అతడే మిమ్మల్ని మన్నిస్తాడు' అని ఉపదేశించాడు.

అప్పటినుంచి భానుదాసు వ్యాపారం కట్టిపెట్టి తన కాలమంతా భగవద్ధ్యానం లోనే వినియోగించ సాగాడు.






పాపాయిలూ !–

తరుచు మనం కలుసుకొని, ఒకళ్ళ వుద్దేశాలు ఒకళ్ళం తెలుసుకున్నప్పుడే మంచీ చెడ్డా వెల్లడి అవుతుంది. అప్పుడే ఏపనైనా చక్కగా నెరవేర్చగలుగుతాం. ఈ సంకల్పం తోనే కొత్తసంవత్సరంలో ఇక్కడ మనం సమావేశం అవుతూవుండటానికి ఏర్పాటు చేశాను. ఇక్కడ మనం మనసు విడిచి మాటాడుకోవచ్చు. మీ సంశయాలు నాకు వ్రాసి చెప్పవచ్చు. మీ సంశయాలు తెలుసుకుని వాటిని తీర్చటానికీ, ఇంకా విశేషాలుంటే మీకు తెలియజేయటానికీ ప్రయత్నిస్తూవుంటాను.

* * * * * *

ఈనెల చిరంజీవి లక్ష్మిభాయి వ్రాసిన చిన్నకథ చదివారుకద! చూపులకు చిన్నదే కాని, ఇది పేర్కొనవలసిన కథ. వాళ్ళమ్మ పేపరు చదవటాన్నిగురించి లోపాలు దాచకుండా, మనసు నొప్పించని ధోరణిలో ఎంచక్కా సంగతులు వెల్లడించిందో చూడండి. దీనినే 'ఆత్మకథ' అంటారు. ఆత్మకథ అనగా తనకు సంబంధించిన కథ అన్నమాట. నిజానికి, మామూలుకథలు వ్రాయడంకంటె ఆత్మకథ వ్రాయటం కష్టం. ఇందుకు చాలా నేర్పూ, అనుభవమూ కావాలి. గాంధీ, నెహ్రూలవంటి గొప్పగొప్పవాళ్ళందరూ వారి ఆత్మకథలను వ్రాసుకొన్నారు. అవి ప్రపంచానికే మార్గదర్శకాలుగా నిలిచివున్నాయి. ఇటువంటివి వ్రాయటానికి మీరూ అలవాటు చేసుకోరాదూ!

* * * * * *

ఈ నెలలో అట్టచివరిబొమ్మ—అనగా రంగులబొమ్మకథ కొత్తవి ప్రారంభించాను. ఇది మంచి గమ్మత్తుగా వుంటుంది. గొప్ప నీతినికూడా బోధిస్తుంది. చూస్తారుగా!

మీ 'కథలతాతయ్య'

# ఇది చేయటం నీవల్ల అవుతుందా?



ప్రక్కనున్న బొమ్మ చూడు. ఒక బల్ల అంచున ఒక కాగితపుపేలిక (రెండు అంగుళాల వెడల్పు, ఎనిమిది అంగుళాల పొడుగు కొలతలు కలది) వుంది. దానిపైన ఫౌంటెన్‌పెన్ (మూత) కాప్ నిలబెట్టివున్నది. కాప్‌ని తాకకుండా, అది పడిపోకుండా, దానిక్రిందవున్న కాకితపుపేలికని ఇవతలకి తీసివెయ్యగలవా?

ఎలా చేయుటం?

ముందు, నీవేలికి తడిచేసుకో. చేసుకుని, కొంచెం బలం ఉపయోగిస్తూ, బల్లమీద వుండే కాగితపు భాగాన్ని వాటంచూచి చఱ్రున బయటకు లాగు. ఫౌంటెన్‌పెన్ కాప్ చెక్కుచెదరకుండా అలానే నిలబడి వుంటుంది. నీవు కోరినప్రకారం కాగితంపేలిక మాత్రం ఇవతలకి వచ్చేస్తుంది.

*　　　*　　　*

ఒక చేతిరుమాలు తీసుకో. ఐమూలగా వున్న రెండు కొసలూ రెండు చేతులలో విడివిడిగా పట్టుకో. చేతుల పట్టు వదలకుండా చెతిరుమాలు ముడి వేయగలవా?

ఎలా చేయటం?

బొమ్మలో చూపినట్టుగా నీ రెండుచేతులూ దండ కట్టి, ఎడమచెతి రెండువేళ్ళతో జేబురుమాలుకొస ఒకటి పట్టుకో. తరువాత కుడిచేతివేళ్లతో రెండవకొస పట్టుకో. జేబురుమాలుమాత్రం పట్టు విడవకు సుమా. ఇప్పుడు నీ రెండుచేతులూ విప్పావంటే, జేబురుమాలు కొసలు రెండూకలిసి, ఒక చిత్రమైన ముడి యేర్పడుతుంది. ఈ ట్రిక్కు చూడటానికి చాలా ముచ్చటగానూ వినోదంగానూ వుంటుంది.





# సుకేశిని కథ

పూర్వం మాణిక్యద్వీపాన్ని చిత్రసేనుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. చాలా కాలానికి కాని ఆయనకు సంతానం కలగలేదు. అదైనా ఆడపిల్ల. ఆమె ఎంతో అందమైనది. ఆమె శిరోజాలు పట్టువలె మృదువుగా బంగారురంగుతో మెరుస్తూ ఉండటంవల్ల ఆమెకు సుకేశిని అని నామకరణంజరిగింది.

సుకేశిని పదహారో పుట్టినరోజు పండుగ ఎంతో వైభవంగా జరుగుతోంది. అదే సమయంలో కింకిణి అనే యక్షిత బిచ్చగత్తె రూపంలో రాచనగరులోకి ప్రవేశించింది. ఆమెను ఎవరూ గమనించలేదు. కింకిణి సరాసరి సుకేశినిదగ్గరకు వెళ్ళింది. సుకేశినికి కింకిణి యక్షిత అని తెలియక, బిచ్చగత్తె అనుకుని తూలనాడింది. దాంతో యక్షిత మండిపోయి ఇలా శాపమిచ్చింది:

"నీ సౌందర్యానికి నీవే గర్విస్తున్నావు. నీలాటి శిరోజాలు ప్రపంచంలో మరో స్త్రీకి లేవనికదా నీగర్వం! నీ తలమీది వెంట్రుకలు యీక్షణంలోనే రాలిపోతవి. అవి మళ్లీ పెరగవు!"

శాపాన్ని ఉపసంహరించుకోమని యక్షితను ప్రార్థిద్దామని అనుకున్నా యక్షిత మాయమైంది. రాజకుమారి తలమీది వెంట్రుకలు రాలిపోయి అందవికారంగా తయారైంది. చూసేవాళ్ళకు నవ్వువొచ్చింది కాని, రాజకుమార్తె చెవినిపడితే ప్రమాదం సంభవిస్తుందని బలవంతాన ఆపుకొన్నారు.

విచారంగావున్న సుకేశినిని తల్లిదండ్రులు ఊరడించారు. ఏదోవిధంగా తిరిగి ఆమె తలవెంట్రుకలు వొచ్చే ఉపాయాలను అన్వేషించసాగారు. దేశదేశాలనుంచి అనేకమంది వైద్యులు వొచ్చారుకాని ఏమీ ఉపయోగం లేకపోయింది.

ఒకానొక సాధువు రాజకుమారిచేత లక్ష్మీ వ్రతం చేయించమని సలహా ఇచ్చాడు. సంవత్సరంపాటు ఎంతో నిష్ఠతో, భక్తితో రాజకుమారి లక్ష్మీవ్రతాన్ని చేసింది.

హెచ్. ఆంజనేయశర్మ - గుంటూరు




చివరకు లక్ష్మి ప్రత్యక్షమై ఒక్క వరం కోరుకోమంది.

చాలా కాలంగా తనకు జుట్టు లేనందువల్ల ఆ ఆదుర్దాకొద్దీ రాజకుమారి తొందరపడి వరాన్ని యీవిధంగా కోరింది: "తల్లీ! ప్రతిరోజూ నా కురులు ఒక అంగుళం పొంతున పెరగాలి. ఒకవేళ కురుల్ని కత్తిరిస్తే అవి రెండింతలు వేగంతో పెరగాలి."

లక్ష్మి ఆమె వరానికి 'సరే' అని చెప్పి అదృశ్యమైపోయింది.

రోజుకొక అంగుళంపొంతున రాజకుమారి శిరోజాలు పెరగసాగినవి. ఐదు వారాలు అయేప్పటికి గజంపాడవున శిరోజాలు పెరిగినవి. రాజకుమారి పూర్వపు సౌందర్యాన్ని తిరిగి పొందింది.

మరో ఐదువారాలు గడిచేప్పటికి ఆమె జడ రెండు గజాలైంది; అది నేలను రాచుకోసాగింది. ఇదేవిధంగా మరో ఐదు వారాలకు మూడు గజాలవరకూ పెరిగింది. ఇక కత్తిరించక తప్పలేదు. కత్తిరించింది మొదలూ రోజుకు రెండేసి అంగుళాల పొంతున జుట్టు పెరగసాగింది. రాకుమారి లక్ష్మీదేవిని కోరిన వరం అదేగదా!

కత్తిరించటంవల్ల ప్రయోజనంలేదు. కత్తిరించినకొద్దీ మరీ త్వరత్వరగా వెంట్రుకలు పెరగసాగినవి. కత్తిరించక చేసేదీ లేదు. రోజూ రాజకుమారి నిద్రలేవకముందే యిద్దరు మనుషులు కురుల్ని కత్తిరించాలి. యీ కత్తిరించిన జుట్టునంతటినీ ఐళ్లలో తీసుకొనివెళ్ళి ఊరిబయట పారవేయాలి.

రానురాను మరీ ఘోరంగా తయారైంది పరిస్థితి. రాజకుమారి నిద్రించేందుకు చాలా

పెద్దగది అవసరమైంది. జుట్టు విపరీతంగా పెరగటం, దాన్ని కత్తిరించగానే రెండింతలు వేగంతో తిరిగి పెరగటం ప్రతిరోజూ జరుగుతూవచ్చింది.

ఈ స్థితిలో జీవించటం అనవసరమని, రాజకుమారి నిరాశచెందింది. పూర్వపు ఆ జుట్టు లేకుండటమే హాయిగా వున్నట్టు తోచింది. ఆమె బాధ చూడలేక రాజుగారు ఒక ప్రకటన చేశారు. రాజకుమారి జుట్టు పెరగకుండా ఆపగలిగిన వారికి ఆమెనిచ్చి వివాహంచేయుటమే గాక, తన రాజ్యాన్నికూడా ఇస్తానని దేశదేశాలా చాటింపించాడు. ఎంతోమంది రాకుమారులు, వైద్యులు, మంత్రగాళ్లు, తంత్రగాళ్లు వొచ్చారు కాని ప్రయోజనం లేకపోయింది.

చివరకు ఇంద్రనాథుడనే రాకుమారుడు వొచ్చాడు. అతను చాలా తెలివిగలవాడు; ఏదైనా ఉపాయంతో ఈ అపాయాన్ని దాటించాలని యోచనచేశాడు. ఈ వుద్దేశంతో ఇంద్రనాథుడు రాకుమారితో యిలా అన్నాడు: "నీవు మేడమీదిగదిలో పడుకుంటావుకదా! నేను తోటలో ఉంటాను. యీ రాత్రి నిద్రపోకుండా, నీ జుట్టు పెరిగే సమయంలో నాకు చెప్పు."



ఇంద్రనాథుడు చెప్పిన విధంగానే అర్ధరాత్రి సమయంలో, జుట్టు పెరగనారంభించింది.

ప్రారంభించగానే సుకేశిని, ఇంద్రనాథునికి ఈసంగతి తెలియపరిచింది.

వెంటనే ఇంద్రనాథుడు ఇలా అన్నాడు: "నీ జుట్టును కిటికీ చువ్వలకు బిగించి కట్టి మెల్లిగా కిందికి దిగిరా—"



అతను చెప్పినవిధంగానే రాకుమారి జుట్టును కిటికీ చువ్వలకు బిగించికట్టి మెల్లిగా కిందికి దిగసాగింది. ఆమె నేల మట్టానికి ఒక గజం ఎత్తులోకి రాగానే, రాకుమారిని జుట్టునుంచి కత్తిరించాడు ఇంద్రనాధుడు.

ఆమెజుట్టు పెరగటం ఆగిపోయింది. ఇదెలా జరిగిందో తెలియక రాజుగారు ఆశ్చర్యపడితే ఇంద్రనాధుడు ఇలా అన్నాడు: "ఏముంది ప్రభూ! ఇదివరకు మీరు రాజకుమారినుంచి జుట్టును కత్తిరించేవారు; అందుకనే జుట్టు పెరుగుతూ వుండేది. నేను జుట్టునుంచి రాకుమారిని కత్తిరించాను. అందుకని ఇప్పుడు జుట్టు పెరగటం ఆగిపోయింది."

అతని తెలివితేటలను అందరూ మెచ్చుకున్నారు. కాని ఇక్కడొక పెద్ద ఇబ్బంది వొచ్చిపడింది. రాకుమారిజుట్టు పెరగటమైతే ఆగిందికాని, రాకుమారే పెరగటం ఆరంభమైంది! మరీ విపరీత పరిమాణంలో ఆమె పెరగసాగింది. ఆమె పెరిగే శరీరానికి రాజభవనం చాలలేదు. మైదానంలోకి వెళ్లవలసివొచ్చింది. మైదానంకూడా చాలక పోతే ఆమె సముద్రంలో దిగింది. ఎంతో



లోతైన సముద్రం ఆమెకు మోకాలివరకే వొచ్చిందంటే ఆమె ఎంత ఎత్తు పెరిగి వుంటుందో సులభంగా ఆలోచించుకోవచ్చు. పూర్వం జుట్టును కత్తిరించినట్లుగా ఇప్పుడు మనిషిని కత్తిరించే అవకాశం కూడా లేదు.

మాణిక్యద్వీపమంతా యిలా అల్లకల్లోలంగా వున్న సమయంలో, శత్రురాజులు పెద్ద ఓడలమీద ద్వీపాన్ని ముట్టడించారు. యీ ప్రమాదాన్ని తప్పించుకునె మార్గం రాజుగారికి కాని, మంత్రులకు కానీ తోచలేదు.

రాకుమారి యీ ప్రమాదాన్ని గ్రహించింది. ఆమెకు ఎత్తుకు తగినంత బలం కూడా వున్నది. శత్రువుల ఓడల్ని ముంచి వెయ్యటం ఒక లెక్కలోదికాదు. కాని ఆమెది చాలా జాలిగుండె. శత్రువులైనా వారికి హాని కలగకుండా ఉండేందుకని, మాణిక్యద్వీపాన్ని పెళ్లగించింది; సముద్రంలో కొన్నిమైళ్ళు నడిచి మరోచోట ద్వీపాన్ని తిరిగి ప్రతిష్ఠించింది. ప్రజలు నిశ్చింతతో బ్రతకసాగారు.

ఆమె మాణిక్యద్వీపాన్ని పెళ్ళగించిన సమయంలో ఇంద్రనాథుడు మెల్లిగా ఆమె చెయ్యిమీదినుంచి పాకి భుజాలవరకూ వెళ్ళాడు. అక్కణ్నుంచి మెల్లిగా ఆమె చెవి



దగ్గరికి చేరాడు. అతను మాట్లాడేవరకూ తన శరీరంమీద మనిషి ఉన్నాడనేదే ఆమెకు తెలీదు.

"రాకుమారీ! నేను ఇంద్రనాథుణ్ణి. నేనిప్పుడు నీజుట్టు కత్తిరిస్తాను. అప్పుడు నీవు మామూలు పరిమాణానికి వొస్తావు; జుట్టుపెరగటం ఆరంభిస్తుంది–' అన్నాడు ఇంద్రనాథుడు.

"సరే" అంది రాకుమారి.

"నీ మామూలు ఎత్తుకు రాగానే జాగ్రత్తగా ద్వీపందాకా యీదాలి" అన్నాడు ఇంద్రనాథుడు.

ఇంద్రనాథుడు జుట్టు కత్తిరించగానే రాకుమారి సాధారణ పరిమాణానికి మారిపోయింది. ఇద్దరూ ద్వీపందాకా యీదారు.

కాని పూర్వంవలెనే తిరిగి జుట్టుపెరగటం ఆరంభమైంది. ఏదైనా ఉపాయంతో యీ అవస్థను దాటాలి. ఇంద్రనాథుడు చాలా దీర్ఘంగా ఆలోచించాడు.

ఒక పెద్దత్రాసును తెప్పించాడు. ఒకతక్కెడలో రాజకుమారిని కూర్చోబెట్టాడు; తక్కెడ ఆమెవైపున భూమిని అనింది. పెరిగే ఆమె తలవెంట్రుకలను రెండోవైపు తక్కెడలో వేయసాగాడు. రెండోవైపు తక్కెడ క్రమంగా బరువెక్కుతూ, భూమివైపు మొగ్గసాగింది. రాకుమారి కూర్చున్న తక్కెడ పైకి లేవసాగింది.

ఈవిధంగా కొంతసేపయేప్పటికి, రెండు తక్కెడలూ సరిసమానంగా అయినవి; వెంటనే ఇంద్రనాథుడు ఆమె జుట్టును కత్తిరించివేశాడు.

జుట్టు కత్తెరపడేలోపలే, రాకుమారికి మరోగజం జుట్టు వొచ్చేసింది...

కాని చిత్రమేమిటంటే, యీస్థితిలో ఆమె జుట్టు మరిపెరగటం ఆగింది; ఎందుకంటే, దీనికి వొక కారణముంది. ఇప్పుడు ఆమె జుట్టు పెరగాలో, లేక ఆమే పెరగాలో తేలక, రెండింటి పెరుగుదలా ఆగిపోయింది.



జీవితంలో తీరదనుకున్న సమస్య ఈవిధంగా తీరిపోయింది. అందుచేత తనకు మహోపకారాన్ని చేసిన ఇంద్రనాథుణ్ణే సుకేశిని వివాహమాడింది.

# మా అమ్మ పేపరు చదవటం

మా అమ్మ సాయంత్రంపూట పేపరు ఎలా చదువుతుందో ఎప్పుడైనా చూశారు? ఏసంగతి మరచినా అమ్మ పేపరు చదవడం మాత్రం మరవదు. పాపం, యింటిపనంతా ముగించుకొని అమ్మ హాల్లోకి వచ్చేసరికి పేపరు పేజీలన్నీ వక్కచోటున వుండవు. నాలుగు వైపులా నాలుగు కాగితాలూ ఇంట్లో పడివుంటాయి. మేజమీద అన్నయ్య చదివి అక్కడే పారేసిన మొదటిపేజీ; అక్కయ్య చదివిన మధ్య పేజీ; ఇవన్నీ యేరుకొనివచ్చి అమ్మ పడుకొని చదవడానికని ఆసక్తితో బెడ్డుమీదకు వెళుతుంది.

అమ్మకప్పుడు జ్ఞాపకమొస్తుంది—తన కళ్ళద్దాలు మరచిపోయినట్లు. వాటికోసరం యిల్లంతా వెతుకుతుంది. ఇటు అటు ఇల్లంతా ఒక పదిహేను నిమిషాలు గాలించిన తరువాత అమ్మకప్పుడు జ్ఞాపకమొస్తుంది యెక్కడుంచిందీ. ఎలాగో కళ్ళద్దాల పెట్టె దొరుకుతుంది. కాని, అది తీసి చూసేసరికి అందులో కళ్లద్దాలు వుండవు. మళ్ళీ ఐదు నిమిషాలు గాలించుతే కళ్లద్దాలు దొరుకుతాయి. ఆఖరుకి పరుపు దగ్గరకు వెళితే, 'పేపర్లు ఏవి! యిక్కడే పెట్టానే!' అనుకొంటుంది.

కొంతసేపు వెతికినతరువాత కళ్లద్దాల కోసం వెళ్ళేముందు ఆ పేపర్లు తలగడా క్రిందనే పెట్టానని అప్పుడు జ్ఞాపకంవస్తుంది. ఇన్ని బాధలుపడి, ఎలాగో పేపరు చదవడానికి మొదలుపెడుతుంది. ఒక్క ఘడియ చదువుతుందో లేదో చేతులో పేపరూ, ముక్కుమీద కళ్లద్దాలూ పెట్టుకొని హాయిగా నిద్రపోతుంది.

ఇంతలో మానాన్న వస్తారు. మమ్మలినందరిని పిలిచి, 'ఒక్కసారిలా వచ్చి చూడండి' అంటారు. ఆ దృశ్యం చూసేసరికి మాకు నవ్వాగదు! ఇంతకూ అసలాపేపరు ఆరోజుదే కాదు. నిన్నటిదో, మొన్నటిదో! తారీకు చూడకుండానే అమ్మ అంత ఆసక్తితో పాతపేపర్లే చదివేస్తూవుంటుంది!

అన్నిటికంటే ముఖ్యమైన విషయం యేమిటంటే: అమన్నాడు అమ్మ మాతో, పేపర్లో ఉండే వింతలూ, విశేషాలూ, వార్తలూ చక్కా పూసగుచ్చినట్టు చెప్తుంది. మరి, ఎలా చెప్పగలుగుతుందో యేమో!

లంకలపల్లి లక్ష్మీబాయి - వాల్తేరు

ఒంటిగీత బొమ్మ



పంపినవారు :

కె. శారద - బళ్లారి

## భూగోళవృత్తాంతం నీ కేపాటి తెలుసు ?

[సమాధానాలు]

| | | | |
|---|---|---|---|
| బల్గేరియా | 14 | ఇటలీ | 13 |
| ఫ్రాన్స్ | 11 | స్పెయిన్ | 20 |
| హాలెండ్ | 3 | ఇంగ్లండు | 18 |
| రుమేనియా | 5 | హంగెరీ | 10 |
| జెకో – స్లోవేకియా | 2 | పోలెండ్ | 12 |
| గ్రీస్ | 17 | యుగొస్లావియా | 8 |

## ఫోటో వ్యాఖ్యల పోటీ

ఫిబ్రవరి ఫొటోల ఫలితాలు



ఫిబ్రవరినెల చందమామలో ప్రచురింపబడె ఫొటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగా వున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు :

మొదటి ఫొటో : ముద్దుల మూట

రెండవ ఫొటో : మోక్షపు బాట

పంపినవారు :

అద్దంకి వెంకటేశ్వరరావు - ఏలూరు

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపిన వారి పేరుతోసహా ఫిబ్రవరి చందమామ ఫొటోల దిగువని ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/- ఫిబ్రవరి సంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.



## మార్చి నెలలో

ప్రచురింపబడే ఫొటోల నమూనాలు వివరాలతోసహా ప్రక్కపేజీలో చూడండి

ముఖ్యసూచన :

వ్యాఖ్యలను ప్రక్కపేజీలోని కూపన్‌లోనే పూర్తిచేసి పంపాలి. పూర్తిచేసిన కూపన్‌ను కవరులో పెట్టి, అతికించకుండా బుక్‌పోస్టుగా పంపవచ్చు. దీనికి మూడుకానుల బిళ్ల అంటిస్తే సరిపోతుంది. ఇందుతో ఎటువంటి జాబులను జతపరచకూడదు.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు.

1953 మార్చి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై రెండు ఫోటోలకూ సరిఐన వ్యాఖ్యలు కావాలి. వ్యాఖ్య ముచ్చటైన ఒక్క మాటలో గానీ, చిన్నివాక్యంలోగానీ ఉండవచ్చు. మొదటి ఫోటోకూ రెండవ ఫోటోకూ వ్యాఖ్యలు సంబంధం కలిగివుండాలి.

★ జనవరి 15-వ తేదిలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ దిగువ కూపన్‌లో వ్యాఖ్యలు రెండూ పూర్తి చేసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటోవ్యాఖ్యల పోటీ, మద్రాసు - 26.

★ చందమామ కూపన్లలోనేగాని, ఇతర విధముల పంపే వ్యాఖ్యలు పోటీకి పనికిరావు.

→ చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ కూపన్ ←

మొదటి ఫోటో

వ్యాఖ్య ..................................

రెండవ ఫోటో

వ్యాఖ్య ..................................

పంపినవారి పేరు ..................................

పూర్తి చిరునామా..................................

Mar '53

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26 and Published by him from Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI CHAKRAPANI

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

మూకీలు

పంపినవారు:
జి. సుబ్బదాసు - టంగుటూరు

